# యోగశాస్త్రం

చదవండి!

మనస్సును పునీతం
చేసుకోండి!



రచన: రాంషా

వెల: రూ 3/-

# సాంఖ్యమ్




మూలం : కపిలమహర్షి
వ్యాఖ్యానం : రాంషా



ధర్మచక్ర పవర్ ప్రెస్,
సామర్లకోట - 533 440

# విషయ సూచిక

## ఇందులో

పరిచయం i

1. పరమ పురుషార్థం ... 1

దుఃఖనివృత్తి-అవస్థ-కర్మ-పాపపుణ్యాలు-అవిద్య- పదార్థాలు బాహ్యప్రతీతి- గతి-సత్కర్మ-లుఅవివేకం- ప్రకృతి పురుష వివేకం- అహంకారం - మూలప్రకృతి- మహత్తు- వివేకం ప్రమాణం-చైతన్యం-అనుమానం-శబ్దం-ప్రమాణాలు- ఆటంకాలు-ప్రకాశం-పురుషబహుత్వం-

2 సృష్టిప్రక్రియ ... 46

మహదాదుల గొప్పతనం-అహంకారం బాధ్యత-తన్మాత్రలు ఇంద్రియాలు- నానాత్వం- సాధారణ వృత్తులు- కరణాలు- మనస్సు ప్రాధాన్యత-

3. మహాభూతోత్పత్తి ... 55

మహావిశేషం-బుద్ధి:భోగం-కర్మలవల్ల మోక్షం-ధ్యానం-ఆసనం స్వకర్మ-వైరాగ్యం-తుష్టి-సిద్ధులు-సృష్టి

4. వివేకం ... 72

5. శుభకర్మలు ... 76

విజ్ఞానానికీ అజ్ఞానానికీగల సంబంధం-ధర్మఫలం-అనుమానం- సాహిత్యం- ఆధేయశక్తియోగం- పునరుక్తి దోషం- శబ్దార్థ సంబంధం-వేదాలకునిత్యత్వంలేదు-వేదాల అపౌరుషేయత్వం

వేదప్రామాణ్యత-భ్రాంతిజ్ఞానం-అన్యథాఖ్యాతివాదం-స్ఫోట
వాదం-ఆత్మాద్వైతవాదం-జీవానందం- ప్రత్యభిజ్ఞానం- అభా
వం-క్రియ-జ్ఞానం-శరీరం-శరీరభేదాలు-సంస్కారం-శరీరాలు
-సిద్ధులు.

6. ఉనికి ... 111

దుఃఖనివృత్తి-అవివేకం-ముక్తి- ధ్యానం- ప్రకృతి విభుత్వం
పరమాణువుల సంఘాతం-గుణాలు-ఉపాధి-వైరాగ్యం-జగత్తు
అహంకారం-గతి-ప్రకృతి పురుష సంబంధం.

'లోకాయుక్త'

ఆవుల సాంబశివరావుగారికి

అంకితం

# పరిచయం

సంఖ్య అనగా అంకె. సాంఖ్యమంటే అంకెలకు సంబంధించిన దని స్థూలంగా అర్థం.అయితే ఇది న్యూమరాలజీ కాదు కనుక ఆ అర్థంలో దీనిగురించి ఆలోచించకూడదు.

సాంఖ్యమ్ అనే మాటకు "పరిగణనమ్"(Discrimination) అని అర్థంఉంది. కనుక విషయాన్ని పరిగణించి చెప్పేదానిని సాంఖ్యమన్నారు ఈ అర్థమే సమంజసంగా ఉంది. శివుడు, అత్రిమహాముని సాంఖ్యులేనని అంటారు.

కపిలమహర్షి, మూలప్రకృతిని బుద్ధి, అహంకారం, పంచతన్మాత్రలు, పంచమహాభూతాలు, మనస్సు, పంచ కర్మేంద్రియాలు, పంచ జ్ఞానేంద్రియాలు, అవ్యక్తము అను 24 తత్త్వాలుగా పరిగణించి అవి పురుషునికి విహారభూములుగా పేర్కొన్నాడు.

ఈపురుషుడు(ఆత్మ)దేనికీ కర్త కాదు;కర్మా కాదు.తతిన్మా 24తత్త్వాలకన్నా ఇది భిన్నంగా ఉంటుందనీ, ప్రతీ ఆత్మా ప్రకృతితో అనుసంధానంపొంది ప్రత్యేకతను సాధించుకొంటుందనీ అన్నాడు. ఆదొకవినూత్న సృష్టి. దానిబంధాలనుంచి బయటపడటంలోనే మోక్షం ఉందని కపిల మహర్షి నిర్ణయించాడు.

సాంఖ్యమ్ మనకు ప్రకృతి వివేచననేగాక పరతత్త్వ వివేచనని కూడా కలిగించింది. విశ్వరూప సందర్శనయోగానికి ఇదే వేదిక.

అందుకే భగవద్గీత "తత్కారణం సాంఖ్యయోగాది గమ్యం" అని చెప్పింది. సాంఖ్యయోగం చేతనే భగవంతుడు తెలియగలడని అర్థం.

'సిద్ధానాంకపిలో మునిః' అని భగవద్గీత, 'కపిలస్తత్వ సంఖ్యాతా భగవాన్' అని భాగవతం, 'పంచమఃకపిలోనామ' అని గరుడ పురాణం,

'ఋషింప్రసూతం,కపిలయస్తమగ్రే' అని శ్వేతశ్వేతరోపనిషత్తు," కపిలః పరమర్షిః పురాతనః" అని భారతమూ ఆయన్ని ప్రస్తుతించాయి.

దీనిని బట్టి కపిలుడు ఆయా గ్రంధాలు పుట్టకముందే ఉండేవాడని చెప్పవచ్చు.

ఏదిఏమయినా ఆయన సాంఖ్యసూత్రాలను మీముందుంచుతున్నాను ఈ సాహసానికి క్షంతవ్యుణ్ణి.

మీ

[signature]

సామర్లకోట.
20-8-1986

# 1

# సాంఖ్యమ్

## పరమపురుషార్థం

ప్ర : ప్రకృతి పురుష వివేకజ్ఞానమే మోక్షసాధన మని మహర్షులన్నారు ప్రకృతి అనగా నేమి? పురుషుడనగా ఎవరు? పురుషార్థము, పరమపురుషార్థమూ అనగా నేమిటి?

జ : ధర్మం, అర్థం, కామం అనేవి మూడూ పురుషార్థాలని వాత్స్యాయన మహర్షి అన్నాడు. జీవుడు మరణించిన తరువాత లభించేది మోక్షమయితే అది కోరదగినది కాదన్నాడు.

ఈ మూడే పురుషార్థాలుకావు. ఈ మూడూ మానవ ప్రాణి పుట్టుకకీ, వృద్ధికీ, వ్యాప్తికీ అత్యంత ప్రధాన మయినవే అయినప్పటికీ, వాటికి నీలి నీడలు లేకుండా లేవు; అధర్మమూ, అనర్థమూ, ద్వేషమూ, వీటినంటే ఉంటాయి. కనుక అత్యంత పురుషార్థమయిన దానిని ఏదో మనిషి కోరవలసి వుంది. అది దుఃఖాన్ని పూర్తిగా నివృత్తి చేయగలిగేదయి ఉండాలి. దుఃఖం మూడు రకాలుగా ఉంది. ఆధ్యాత్మిక దుఃఖం. అధిభౌతికదుఃఖం, అధిదైవిక దుఃఖమని మూడు.

1.కామ, క్రోధ,లోభ,మధ, మాత్సర్యాల వల్ల కలిగే మానసిక అనుతాపం ఆధ్యాత్మిక దుఃఖం ( Psycho spiritual ) 2. జ్వరం, క్షయ,పక్ష వాతం వగైరా వ్యాధుల వల్ల కలిగిన దుఃఖం అధిభౌతిక దుఃఖమనబడుతుంది ( Psycho-somathe ) 3. భూకంపం, అతివృష్టి, అశనిపాతం, అగ్నిప్రమాదం, ఘోరభయం మున్నగునవి అధిదైవిక ( Psycho-acci-

dental ) దుఃఖానికి సంబంధించినవి.

మొత్తంమీద ఈమూడు దుఃఖాలు మానసిక మైనవేనని గ్రహించండి. అనగా మనస్సుకీ, శరీరానికీ సంబంధించినవేగాని పురుషునికి (ఆత్మకు) సంబంధించినవికావు.

దుఃఖం పురుషునిది కాకపోయినా దుఃఖానుభవం ఆత్మకు సంబధించినదేఅవుతుంది. కనుక ఆత్మకు దుఃఖం కలగకుండా చేసుకోవటం కోసం 'వివేకం' అవసరమని చెప్పకతప్పదు.

ప్ర : సత్కార్యవాదమే సాంఖ్యం. అదివరకు లేని వస్తువేదీ క్రొత్తగా ఏర్పడుతుందనిగాని, ఉన్నవస్తువు ఎన్నడూ లేకుండా పోతుందనిగాని సత్కార్యవాదులు అంగీకరించరు. అప్పుడు దుఃఖనివృత్తి (అనగా నాశనం) జరుగుతుందా?

జ : దుఃఖాన్ని తప్పించుకుని చరించే అవస్థ, దానికే అతీతావస్థ అని పేరు. జ్ఞానం వల్ల దుఃఖాన్ని తప్పించుకోగలం. అయితే జ్ఞానసాధన (యోగం) కష్టసాధ్యమైనది.

## దుఃఖనివృత్తి

ప్ర : అంతకన్నా మనోవ్యాధులకు, శరీర రుగ్మతలకు ఎన్నో ఔషధాలున్నవి కదా! వాటి, సేవించకూడదా? వాటి వల్ల వ్యాధి, తద్వారా దుఃఖమూ నివృత్తి అవుతుందికదా?

జ : ఈ మనో శారీరిక తాపాలను పోగొట్టు కోవటానికి ఈ లోకంలో ఔషధాలు, పానాలు చాలాఉన్నాయి. వాటివల్ల ఈ దుఃఖం తాత్కాలికంగా పోయినా మళ్ళీ మళ్ళీ వస్తూనే ఉంటుంది. అందువల్ల ఔషధాదులు నిరుప

యోగమే అవుతున్నాయి. జ్వరానికి మందు తీసుకున్నంత మాత్రాన మళ్ళీ జ్వరంరాకుండాఉంటుందా?

ప్రి : వస్తుంది. వస్తుందికదాఅని, జ్వరం వచ్చినప్పుడు మందు వేసుకోకుండా ఉండటం మంచిపని కాదు. మందుపుచ్చుకొని రోగాన్ని పోగొట్టుకోవలసిందే. ఔషధంకూడా పురుషార్థమే కదా? ఆకలిరోజూ కలుగుతుందిగదా ఎంత తిన్నా ఒకటే అని బుద్ధిమంతుడెవడూ అన్నంతినటం మానెయ్యడు. అతను తింటూనూఉంటాడు; మళ్ళీ ఆకలి వేస్తూనూ ఉంటుంది. అది సహజం.

జి : అన్నిరోగాలకు మందులులేవు. ఉన్నా ఆరోగాలను సమూలంగా అవి తొలగించలేవు. కనుక నిపుణులయినవారు ఈ ఔషధాదుల్ని చాలా అల్ప విషయాలుగా భావిస్తారు.

ఔషధాదుల కన్న శ్రేష్ఠమయినది, అన్నిటికన్నా ఎక్కువ ఉత్కర్ష గలదిగా శ్రుతిచే పేర్కొనబడిన మోక్షం ఉంది. దానిముందు అన్నీఅల్పసే, కనుక మోక్షాన్ని కూడా పురుషార్థమని చెపుతారు.

ఔషధాదిదృష్టఉపాయాలు ఎలాఉన్నాయో, బ్రాహ్మణ్యులు చేయించే శాంత్యాది అదృష్టోపాయాలు కూడా అలాగే ఉన్నాయి. ఈ రెండింటిలోనూ ఏవిధమయిన విశేషమూలేదు.

కొందరికి స్వభావతః దుఃఖం ఉంటుంది. ఎప్పుడూ దేనికోదానికి ఏడుస్తూనే ఉంటాడు. దుఃఖమే వారికి నైజం అవుతుంది. అలాంటి వారికి మోక్షం లేదు. కనుక వారి నేదో ఉద్ధరించాలని ప్రయత్నించక విడిచిపెట్టడమే మంచిది.

అగ్నికి వేడి స్వభావమే. వేడి లేకుండా అగ్నే లేదు.

అగ్నిలో వేడి పుట్టడానికి ఏది కారణమో అది అలక్ష్యమయినప్పటికీ, అగ్నికి పుట్టుకతోనే వేడి లభిస్తుంది కనుక వేడియే అగ్నికి స్వభావమని చెప్పబడింది.

'స్వభావస్య అనపాయత్వాత్' వస్తువు ఉన్నంతవరకూ ఉండేది స్వభావం ఒక్కటే।

ప్ర: బాగానే ఉంది. ఎవరేంచేసినా స్వభావం మారదనుకునే పక్షంలో సాహిత్యం ఎందుకు? శాస్త్రం ఎందుకు? మోక్షాన్ని సాధించే విధానాన్ని బోధించటం ఎందుకు?

జ: స్వభావాన్ని మార్చటం ఎవరికీ శక్యం కాదనుకున్నపక్షంలో శాస్త్రోపదేశఫలం సంభవించదుగదా? కనుక అలాంటిచోట ఉపదేశం చేసినా ఒకటే; చేయకపోయినా ఒకటే

ప్ర: తెల్లని బట్ట ఉంది; దానికి ఎర్రరంగు వేయించామనుకుందాం. అప్పుడు దాని స్వాభావికమయిన తెల్లరంగు తుడిచిపెట్టుకుపోలేదా?

అలాగే విత్తనం ఉంది. దానికి మొలకెత్తే స్వభావం ఉంది. ఆ విత్తనాన్ని పెనంలో వేయిస్తే దాని మొలకెత్తే స్వభావం నశించిపోలేదా?

కనుక స్వభావాన్ని సమూలంగా మార్చివేయుటం సాధ్యమనుకొంటాను.

జ: ఉత్తేజకం, ప్రతిబంధకం అనువాటినుంచి ఆవిర్భావం, తిరోభావం కలుగుతూ ఉంటాయి.

ఉత్తేజకం అంటే అనుకూలమయిన ప్రేరణ (Stimulation). ఆ విత్తనం తడినేలలో పడితే అంకురించటానికి అనుకూలపరిస్థితులు ఏర్పడతాయి దానితో ఆ విత్తనం ఉత్తేజం పొంది అంకురిస్తుంది. కాలుతున్న నేలమీద పడితే ప్రతిబంధకం (Obstruction) ఏర్పడి, అంకురించటం మానేస్తుంది. అప్పుడు దాని అంకురించే స్వభావం వెనక్కి, వెనక్కి వెళుతుంది అదే తిరోభావం. అదే పెనంలోపడ్డ విత్తనమయితే జొన్న విత్తులా పగిలి పేలాలయిపోతుందేగాని సజీవమై ఉండదు గదా! చచ్చిపోయిన దానికి స్వభావం కూడా చచ్చిపోతుంది స్వభావమే లేనిదానికి మారే సమస్యే లేదు

తెల్లచీరకు ఎర్రని రంగు వేశామనుకుందాం అప్పుడాచీరకుగల సహజ స్వభావమయిన తెలుపు పోయినట్లే కనిపిస్తుంది. రానురాను ఆ ఎర్రరంగు వెలిసిపోవటంతో తెల్లరంగు ఎంతో కొంత బయటపడటం జరుగుతుంది.

కనుక విద్య, విజ్ఞానం, సాహిత్యంవంటివి మానవ స్వభావాన్ని కొంతవరకూ మరుగుపరచగలవేగాని, పూర్తిగా మార్చలేవు.

అయితే చీరవెలిసిపోతుంటే మళ్ళీరంగువేస్తాము తిరిగి ఆవిర్భవిస్తున్న తెల్లరంగు, మరోసారి ఎర్రరంగులో ముంచబడటం ద్వారా తిరోగమిస్తుంది.

కనుక విద్య, విజ్ఞానం, సాహిత్యాల ద్వారా కొంత వరకూ స్వభావానికి ఉత్తేజకం కలగకుండా ఉంచవచ్చేగాని, పూర్తిగా నిర్మూలించలేము.

ప్ర: ఏకార్యానికయినా కాలం, దేశం, కర్మం అని మూడునిమిత్తాలు (Factors) ఉంటాయి. ఆమూడు నిమిత్తాలు ఆకార్యానికి ప్రతిబంధకాలవుతున్నాయి. ఏ మనిషికి దుఃఖం

స్వభావంకాదో, ఆమనిషికి కాలంవల్ల దుఃఖం జనించదని ఏముంది?

జ : కాలం అనంతమైనది. దానికి అన్ని వస్తువులలో సంబంధంఉంది. కాలమే పదార్థంయొక్క పుట్టుకకూ, వృద్ధికీ, నాశనానికీ కారణమవుతున్నది. అంతవరకూ ఒప్పుకొంటున్నాం. కాలం వ్యక్తిని బంధించినట్లే కనిపిస్తుంది.

నిజానికది కాలప్రభావంకాదు. ఒకే కాలంలో పుట్టేవాళ్ళు పుడుతున్నారు; వృద్ధి పొందేవాళ్ళు పొందుతున్నారు; చచ్చేవాళ్ళు చస్తున్నారు. కనుక అందరి యందూకాలం ఒకే సమయంలో ఒకేలాలేదు. కనుక కాలం అందరినీ ఒకేలా బంధిస్తుందని చెప్పటంతప్పు. కాలానికి బంధగుణమే లేదు, ఉన్నదల్లావస్తు పరిణామమే

ప్ర : దేశబంధనంమాట ఏమిటంటారు?

జ : జ్ఞాని, అజ్ఞానీకూడా ఒకేనేలపై ఉంటున్నారు జ్ఞానానికి లేని సంబంధం అజ్ఞానికెక్కడనుంచి వచ్చింది? అజ్ఞానికున్న దేశబంధం జ్ఞానికెలా లేకుండాపోయింది? ఉంటే యిద్దరికీ ఉండాలి. లేకుంటే యిద్దరికీ లేనట్టే

కాని, అజ్ఞానికే తానుపుట్టి, పెరిగిన ప్రదేశంపై మమకారం ఎక్కువగా ఉంటుంది. జ్ఞాని విపులాచ పృథ్వీ అనుకుంటాడు.

ఆ వూళ్ళో పుట్టినవాళ్ళూ, పుట్టనివాళ్ళూకూడా అదే వూళ్ళో బ్రతుకుతున్నారు. కొందరికి ఆ ఊరిపై మోహంఉంటే కొందరికి ఉండదు.

## అవస్థ

ప్ర : పోనీ అవస్థల సంగతేమిటి?

జ : బాల్యం, కౌమారం, యవ్వనం, వార్ధక్యం అను అవస్థలున్నవి. ఇవి శరీరానికేగాని మనస్సుకుకాదు. మనస్సువల్ల బాలుడు పెద్దరికాన్నీ, వృద్ధుడు యవ్వనాన్నీ, బాల్యచాపల్యాన్నీ పొందుతారు. కనుక అవస్థలు, అవస్థాంతరాలు శరీరానికీ, మనస్సుకీ సంబంధించినవేగాని, పురుషునకు సంబంధించినవికావు.

ఈ పురుషుడు (జీవుడు) అసంగుడు. ఏవిధమైన వికారసంబంధమూ లేనివాడు. కనుక జీవికి బాల్య యవ్వన వార్ధక్యాది అవస్థలు లేవు.

కర్మ

ప్ర: ఎవడు చేసుకున్న కర్మ వాడు అనుభవించాలిగదా? కనుక కర్మవల్ల జీవునికి బంధం ఏర్పడటం లేదా?

జ : శరీరమే కర్మను చేస్తుంది. ఆ కర్మ మంచిదయినా, చెడ్డదయినా అది శరీరానికే వర్తిస్తుంచి గాని జీవునికి వర్తించదు. జీవుడు శరీరాన్ని వదిలి పోయేటప్పుడు కర్మఫలాన్ని కూడా వదులుకు పోతాడు. శరీర కర్మకు జీవుడే జవాబుదారీ అవటం అతి వ్యాప్తి. కనుక ఏ కర్మమూ జీవుని బంధించదు

కర్మకి ఫలంకూడా బద్ధమైనట్లు కనబడటం లేదు. పుణ్యకర్మలు చేసుకొన్నవారికి పుణ్యఫలమయిన సుఖమే లభించాలి పాపకర్మలు చేసుకొన్నవారికి పాపఫలమయిన దుఃఖం కనిపించాలి పాపకర్మలు చేసుకున్న వారిలో కొందరికి పుణ్యఫలం, కొందరికి పాపఫలం లభిస్తోంది. కొందరికి ఏఫలమూ లభించటం లేదు. అలాగే పుణ్యకర్మలు చేసుకొన్నవారిలో కొందరికి పుణ్యఫలమూ, కొందరికి పాపఫలమూ లభిస్తున్నాయి. కొందరికి ఏఫలమూ లభించటం లేదు. ఏఫలం లభించినా, అందరికీ సమానంగా లభిం

చటంలేదు. ఈవిధమయిన విచిత్రభోగానుపపత్తి జీవునకు అన్యధర్మమయిన శరీర ధర్మాన్ని అనుభవించటంలో కలుగుతుంది.

## పాపపుణ్యాలు

ప్ర: శరీర ధర్మం అయిన పాపపుణ్యాల ఫలానుభవం జీవునకు కలిగిందంటున్నారు గదా! అది ఎందువల్ల కలిగింది?

జ: అవివేకంవల్ల. ఈ పాపపుణ్యాలు తనకు సంబంధించినవి కావన్న జ్ఞానం జీవునకు కలిగితే దానికి బంధమే లేదు.

ప్ర: జీవప్రకృతిలోనే బంధం ఉండదని ఎందు కనుకోకూడదు?

జ: ప్రకృతికూడా స్వతంత్రం కాదు. అదికూడా దేనిచేతనో నడిపింపబడుచున్నది కనుక పరతంత్రమయిన ప్రకృతి జీవునికి ఏమాత్రం బంధకం కాదు.

పురుషుడు (జీవుడు) నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, ముక్తశీలుడు. అనువంశికమయిన జీవం పరంపరానుగతమై ప్రవహిస్తుంది. కనుక అది నిత్యమైనది; నిర్మలమైనది. పుణ్యపాపా లంటనిదీ కావున శుద్ధు: వివేకవంతమయినది కావున బుద్ధుడు; నిర్లిప్తత కలది కావున ముక్తశీలుడు, కనుక దానికి బంధయోగం ఉన్నట్లుగా కనిపిస్తుందేగాని నిజం ఉండదు.

## అవిద్య

ప్ర: ఇంతకూ మీరు చెప్పినదానినిబట్టి అవిద్యవల్ల బంధం ఏర్పడుతుందని అనుకోవచ్చా?

జ: అజ్ఞానానికే సంవృత్తి అనిపేరు. అది వస్తువు కాదు. వస్తువు కానిదేదీ జీవుని బంధించ లేదు. అవిద్యను మీరు వస్తువేనని అంగీకరించినట్లయితే అసలు సిద్ధాంతమే తప్పుతుంది. విజ్ఞానం వస్తువు కాదు గదా! విజ్ఞానం వస్తువు కానపుడు అజ్ఞానం వస్తు వెలాఅవుతుంది?

ప్రతి జీవునికి విజ్ఞానాత్మ ఉన్నది. అది జీవుని అంతరంగమే గాని బాహ్యప్రవృత్తి కాదు. అది జీవునికన్న భిన్నమూ కాదు. విజ్ఞానం వేరు. జీవుడు వేరు అని ద్వైతాన్ని ఆపాదించటం సబబు కాదు.

జీవుడు విజ్ఞానరూపుడే కనుక అజ్ఞానరూపునిగా భావించటం విరుద్ధం, జీవుడు పదార్థమై, జీవగతమయిన చైతన్యం అపదార్థ మవుతున్నపుడు జీవుడు పదార్థం అవుతూ కాకుండాపోవడం జరుగుచున్నది. అంతకంటే విరుద్ధం ఏముంది?

అదికూడా మేము ఒప్పుకోవడం లేదు; లోకంలో పదార్థా లున్నాయి. పదార్థాలు కానివీ ఉన్నాయి. ఉదాహరణకి: ఆకాశం, దిక్కాలు వగైరా; కాని పదార్థమయి, పదార్థం కాకుండా పోయినవి ఏవీ లేదు. ఒక్క జీవుడు తప్ప. ఇతరేతర పదార్థంలో లేని చైతన్యం జీవునిలోనే ఉంది. అందుకే అది ద్వైకాపత్తిని పొందింది.

## పదార్థాలు

ప్ర: పదార్థాలు ఎన్ని?

జ: మేము వైశేషికుల వలెనో, నైయ్యాయికులవలెనో పదార్థవాదినులం (materialists) కాము. వారికున్న నియమాలు మాకు లేవు. కాని, యుక్తివల్ల సిద్ధించని ఏ పదార్థాన్నీ మేము స్వీకరించం యుక్తి అనగా

తర్కబుద్ధి. తర్కబుద్ధికి అందని పదార్థాలను మేము స్వీకరించే పక్షంలో మేము పిచ్చివాళ్ళమన్నా కావాలి; పిల్లలమన్నా కావాలి.

ప్ర: మీరు యుక్తికి అందని ఏ పదార్థాన్నయినా నిరాకరిస్తాం అన్నారు. అది ధ్యానంవల్ల లభిస్తుంది. నిరంతర ధ్యానం వల్ల విషయోపరాగం కలగదా? అది అనాది విషయోపరాగమై జీవుడికి బంధాన్ని కలిగించదా?

జ: విషయములందు. అనగా బాహ్య పదార్థాలయందు మనస్సు తగులుకొని ఉండటాన్నే విషయోపరాగమని అంటారు. అది విజ్ఞానాత్మకు బంధం కాదు.

విజ్ఞానాత్మ శరీరంలోఉంటుంది; పదార్థం బైటఉంటుంది. ఈ రెండిటికీ ఉపరంజ్య-ఉపరంజకభావం సైతం సాధ్యంకాదు. ఒకటి హస్తినాపురంలో ఉంటే, ఒకటి పాటలీపుత్రంలో ఉన్నట్లే ఉంటాయి. వాటిరెండిటికీ మధ్య చాలాదూరం ఉంటుంది.

ప్ర: అయ్యా, మనోవ్యాపారం శరీరంలో జరిగే మాట నిజమే. కాని మనస్సు ఊరేగుతుంది. అదిపోలేని దూరంగాని, అందుకోలేని వస్తువుగానిలేవు. కనుక విషయోపరాగం వల్ల జీవుడు బంధుడే అవుతున్నాడు.

జ: ముక్తుడయినవానికి ఈ విషయోపరాగత్వం ఉండదనీ ముక్తుడు కాని వానికే ఉంటుందనీ మీఅభిప్రాయం కాబోలు; అంతఃకరణ గలవాడెవడయినా బాహ్య విషయాలగురించి ఆలోచించవలసివస్తే వాడిమనస్సు తప్పకుండా విషయోపరాగాన్ని పొందుతుంది. బద్ధునికి మరుపూవుంది; ముక్తునికి

స్మృతి ఉంది. కనుక బంధమోక్షాలవ్యవస్థ అర్థంలేనిది. బద్ధునికయినా, అబద్ధునికయినా విషయ సంయోగం సమానంగానే ఉంటుంది.

ప్రః విషయప్రవేశం బద్ధునికీ, ముక్తునికీ ఒకేలా ఉన్నప్పటికీ విషయోపరాగం పొందినవాడే బద్ధుడవుతాడు. పొందనివాడు ముక్తుడవుతాడు. కనుక వ్యవస్థ ఏర్పడుతున్నది.

జః రెండుపనులు ఏకకాలమందు జరగవు. విషయ ప్రవేశం అంటూ చేసినవాడు విషయానురక్తుడు కాకుండా ఆ విషయాన్ని గ్రహించలేడు. విషయమందు ఎప్పుడయితే అనురక్తుడయ్యాడో అప్పుడే విషయోపరాగం కలుగుతుంది. కళ్ళున్నవాడే దృశ్యాన్ని చూచి ఆనందించగలడు: కళ్ళులేనివాడు దృశ్యాన్ని చూడనూలేడు. కళ్ళు ఉండికూడా చూడనివాడు గుడ్డివాడికన్నా అధముడు. వానిని ముక్తుడనలేము. కళ్ళు దృశ్యాన్ని చూడటంకోసమే ఉన్నాయి.

కనుక బద్ధుడయినా, ముక్తుడయినా ఎంతో కొంతసేపు విషయోపరాగుడు కావటం తధ్యం. అనగా వాడు దృశ్యాన్ని భోగించినవాడే అవుతున్నాడు. వాడు భోక్త.

కర్తయయినవాడు దృశ్యాన్ని భోగించడు ఈ రెండుపనులూ ఒక్కసారేజరగవు. విముక్తుడయిన పురుషుడు కర్త కావాలి. బద్ధుడు భోక్తకావాలి పైనచెప్పిన విధంగా రెండుకార్యాలనూ ఒకడే చేస్తున్నప్పుడు కర్తతానే అయి భోక్తకూడా తానేకావాలి. ఉపకారం చేసేవాడుంటేనే చేయించుకునేవాడూఉంటాడు. ఆరెండూఒక్కడై ఉండరు.

ప్రః తండ్రికున్న సంస్కారం కొడుక్కి వస్తోందిగదా!

జ : చాలాబాగుంది ఒకడు ఒకస్త్రీని వివాహంచేసుకుని ఆమెకు గర్భాదానం చేశాడు. ఆవేళ ఎన్నోమంత్రాలుజపించాడు. ఎందుకట? అతనికి పుట్టబోయే బిడ్డకు ఆత్మసంస్కారం కలిగించటం కోసమట! అసలు బిడ్డ పుడతాడో, లేదో తెలియదు. పుడితే ఎప్పుడుపుడతాడో తెలియదు. ఇప్పుడు జరిపిన సంస్కారం సద్యోగర్భానికయితే పని కొస్తుందేమోగాని పదేళ్ళ తర్వాత పుట్టే, బిడ్డకు పనికొస్తుందా?

అదేవిధంగా మనస్సులు ఎప్పటికప్పుడు కొత్త కొత్త విషయాల యందు తగుల్కొని విషయోపరాగం పొందేమాట నిజమే. అంతమాత్రాన అది బంధం కాదు. గంట క్రితం మనం మెచ్చుకున్న విషయమేమిటో ఇప్పుడు చెప్పలేం గదా!

కనుక విషయాలయందు అనురక్తి గలవాడికి మోక్షం కలగదనే (బౌద్ధమత) సిద్ధాంతం శుద్ధ తప్పు

ప్ర: భావపదార్థాలన్నీ క్షణికాలేనని, ఏ ఒక్కటిస్థిరంగా ఉండదనీ వైభాషికు లంటున్నారు. అదే నిజమనిపిస్తోంది. ఈ ప్రపంచంలో ఏ పదార్థమూ స్థిరంగా లేదు. నిత్యపరిణామంలో ఉంటోంది. కనుక క్షణికమె ఉంటోంది ఏమంటారు?

జ; ప్రత్యభిజ్ఞవల్ల ఏవస్తువూ క్షణికం కాదు; ఎప్పుడో కొన్నేళ్ళ క్రితం చూసిన స్నేహితుడు కనబడగానే గుర్తుపట్టి సంతోషంతో పలకరిస్తున్నామా లేదా? అలా గుర్తుపట్టటాన్నే ప్రత్యభిజ్ఞ అంటాము వస్తువులన్నీ క్షణికాలే అయితే మీ స్నేహితుడు కనబడటమూ జరగదు; వాడిని మీరు గుర్తుపట్టటమూ జరగదు.

దీనిని శ్రుతి న్యాయం విరోధిస్తుంది.

"సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అని ఛాందోగ్యోపనిషత్తు (6-2-1) చెప్పింది. "ఈ సమస్త ప్రపంచమూ తొలుత పదార్ధమే (సత్తు) అయి ఉన్నది" అని అర్ధం. "కధ మసతః సజ్జాయేత్" (ఛాం. 6-21) అసత్తునుండి స త్తెలాపుడుతుంది ? అని అడిగింది. నాటికీ నేటికీ పదార్ధం మారలేదు. కనుక పదార్ధం ఎన్నడూ క్షణికం కాదు.

ప్ర: మీరు చెప్పిన శ్రుతి న్యాయాలు రెండూ భావ పదార్ధాలన్నీ సత్వం (Stamina) కలవని చెప్పాయేగాని క్షణి కాలు కావని చెప్పలేదు గదా!

జ: బౌద్ధులు చెప్పే క్షణికవాదానికి దీపశిఖను ఉదాహరణగా తీస్తు కున్నారు. 'యత్ సత్ తత్ క్షణికం యధా దీపశిఖా' అని ఏది సత్త్వమో అది దీపశిఖవలె క్షణికమైనదని వా రన్నారు. దీపశిఖ క్షణంలో ఆరిపోలేదు. క్షణ క్షణం మారిపోతున్నది. మారుతున్న దేదో ఉన్నది. కనుక అది క్షణికం కాదు.

భావ మనగా వస్తువు: భావ మనగా కల్పన. కల్పనా పదార్ధాలు క్షణికాలే కాదనం. కాని యత్ సత్ తత్ క్షణికమ్ అన్నందునే మా విరోధం. వస్తువులకు సత్తా ఉన్నందున అవి క్షణికాలు కావు.

ప్ర: ఏదేని వస్తువుగురించిన భావనయే భావమనుకుందాం. ఆవస్తువునుచూడగానే దానికి సంబంధించిన భావం మనస్సులో కలుగుతుందిగదా! ఆభావమే క్షణికమని బౌద్ధులమైన మేమంటున్నాము.

జ: అప్పుడు మీరు యత్ సత్ తత్ క్షణికం అనటంతప్పు. కేవల కపోలకల్పిత పదార్ధాలు క్షణికాలనటంఒప్పు.

ప్ర: వస్తువును చూడగానే దానికి సంబంధించిన భావం మనస్సులో కలిగింది. అనగా భావపదార్థం ఏర్పడింది. మనస్సు వస్తువునుండి మళ్లీ భావపదార్థంలోకి ప్రవేశించగానే వస్తువు నశించింది. అనగా ఆ వస్తువును గురించి నూటిగా ఆలోచించటం మానివేసి, దానికి సంబంధించిన భావాన్ని మాత్రమే తీసుకొంది. ఏ క్షణంలో ఆ భావాన్ని గూడా విడిచిపెట్టి మనోదానిలోకి పోతుంది. అప్పుడు భావపదార్థాలు క్షణికం కావా ?

జ: మీ మనస్సు చూడటం మానేసిన అసలు పదార్థం మనకళ్ళముందే ఉంది. అదే సత్తు దానికి సంబంధించిన భావాలు క్షణికాలయినా కాక పోయినా అవి మీ స్వకపోల కల్పితాలే గాని, యదార్థవస్తువులు కావు. ఒకే సమయంలో పదార్థము, ఆ పదార్థానికి సంబంధించిన భావమూ ఉండే టట్లయితే వాటికి కార్యకారణభావముండదు. ఒకదాని తరువాత ఒకటి క్రమంగా ఏర్పడె వాటిల్లోనే కార్యకారణభావం ఉంటుంది. అందుకే ముందుగా వస్తువు కనిపించింది అది కారణం. దానివల్ల ఆ వస్తువుకు సంబంధించిన జ్ఞానం మనసులో కలిగింది. అది కార్యం. కారణం లేకుండా ఎక్కడా కార్యం జరగదు.

ప్ర: నిష్కారణంగా ఎన్నో పనులు జరుగుతూనే ఉన్నాయి. కారణం లేకపోతే కార్యం జరగదా ఏమి?

జ: జరగదు. కారణం నశించిపోతే కార్యం ఎలా జరుగుతుంది? మట్టి కారణంగా కుండలు తయారవుతున్నాయి. మట్టి లేకుండా కుండలు తయారవుతాయా ?

ప్ర: ఏదో కారణంవల్ల మట్టి పుట్టి కార్యమయింది ఆమట్టి కారణంగా కుండలు తయారయ్యాయి. మొదటిది కారణ కార్యమయితే రెండవది కార్యకారణం కావటం లేదా?

జ: మట్టి ఉన్నంతమాత్రాన కుండలు తయారు కావు అలా మట్టి నుండి కుండను తయారుచేయటానికి పనికివచ్చే కుమ్మరిసారెవంటి ఉపాదాన కారణా లుండాలి. ఉపాదానకారణా లున్నప్పుడే కార్యకారణ భావానికి అన్వయం కుదురుతుంది. అది లేనప్పుడు కార్యోత్పత్తి కాదు కావున ఉపాదాన కారణం లేనిస్థితిని అన్వయ వ్యతిరేకస్థితి అంటాము. కనుక కారణం ఉండి, కార్యం కూడా ఉన్నా ఉపాదాన కారణం లేకపోతే కార్యమూ లేదు; కారణమూ లేదు.

క్షణికవాదాన్ని అంగీకరించినట్లయితే మట్టి ఉన్నంతవరకూ కుండ ఉండదు. మట్టి లేని క్షణంలోనే కుండ ఏర్పడుతుంది. దీనికి అన్వయం లేదు.

ప్ర: కార్యం ఉత్పత్తి అవుతున్న క్షణంలో నిమిత్త కారణం ఉండదు. అదేవిధంగా ఉపాదాన కారణం కూడా ఆ క్షణంలో ఉండవలసిన అవసర మేమిటి?

జ: కార్యంకంటే ముందే ఉపాదాన కార్యం ఉంటుందని అంగీకరించే పక్షంలో ఫలానా కార్యానికి ఫలానా ఉపాదాన కారణమని చెప్పలేము.

దేని నిమిత్తం మట్టిని తీసుకున్నాం? కుండనిమిత్తం. కనుక మట్టి కుండకు నిమిత్తకారణ మయింది. కుండ తయారవుతున్నప్పుడు మట్టి ఉపాదానకారణ మయింది. కనుక కార్యం ఉత్పత్తి అవుతున్న క్షణంలో ఉపాదాన కారణం ఎందుకుండాలని ప్రశ్నించటం వివేకవంతం కాదు.

## బాహ్య ప్రతీతి :

ప్ర: కళ్లు విప్పి చూస్తే సమస్త బాహ్య ప్రపంచమూ విజ్ఞానవంతంగానే కనిపిస్తుంది. రకరకాల పదార్థాలతో, చిత్ర విచిత్రంగా కనిపిస్తుంది. అంతకన్నా విజ్ఞానం ఎక్కడుంది ?

జ : విజ్ఞానం ప్రకృతిలో లేదు. దానిని గ్రహించే మానవ మేధలో ఉంది. మేధ సరిగా లేకపోతే .... .... ?

ప్ర: బాహ్యజ్ఞానం కూడా స్వప్నజ్ఞానంలాగే తనంత తా కలుగుతుంది.

జ ; ప్రపంచం వస్తువులతో (అర్థాలు) నిండివుంది. అవే లేకపోతే జగత్తే శూన్యమవుతుంది. బాహ్యవస్తువులే లేకపోతే విజ్ఞానంకూడా మనకు లభించదు. విజ్ఞానం లభించేది మనస్సుకే. వస్తువుకు విజ్ఞానం గ్రహించే శక్తి లేదు. విజ్ఞానం పంచజ్ఞానేంద్రియాత్మకం కనుక: విజ్ఞానం వస్తువులో లేదు. గ్రహించిన మనస్సులోనే వుంది.

ప్ర : శూన్యవాది : శూన్యం తత్వం ; భావోవినశ్యతి, వస్తు ధర్మత్వా ద్వినాశస్య- వస్తువుయొక్క సహజధర్మం నాశనం పొందటమే కనుక దానినుంచి మనకు లభించే తత్త్వమూ శూన్యమే, భావమూ శూన్యమే.

జ : అపవాద మాత్ర మబుద్ధానామ్- బుద్ధి లేనివాడు వేసే అపవాదు మాత్రమే యిది :

బుద్ధిమంతులు దీనిని అంగీకరించరు. ఏ పదార్థమయినా అతీతావస్థను పొందుతుందేగాని నశించిపోదు. హిమం ద్రవించి నీరవుతుంది:

నీరు యిగిరి ఆవిరవుతుంది; ఆవిరి మేఘ మవుతుంది; మేఘం కరిగి నీరవుతుంది; నీరు ఘనీభవించి హిమ మవుతుంది. ఇవి ఒకదాని కొకటి అతీతావస్థలు. మంచుగడ్డలు నశించిపోయా యనుకోవటం బుద్ధిలేనివారి పని. విజ్ఞానబుద్ధిగలవాడి పనికాదు.

హిమం కరిగి నీరై, తిరిగి హిమం అయ్యేవరకూ పొందే అవస్థల్ని సౌత్రాంతికులు గమనించి బాహ్యవస్తువులు క్షణికమన్నారు. పదార్థపరిణామంతోబాటు కలిగే విజ్ఞానపరిణామాన్ని చూసి యోగాచారుడు క్షణిక విజ్ఞానవాదాన్ని ప్రతిపాదించాడు ఈ రెండూ అర్థసత్యాలేగాని సమగ్రసత్యం కాదు కనుక నిరాదరింపదగ్గవి. వీటితో సమానమైనదే ఈ శూన్యవాదం. దానివి కూడా పరిత్యజించాలి.

ప్ర: జొత్తిగా అలా అనకండి. పరమపురుషార్థ మయిన మోక్షం ఉన్నది; అది శూన్యమే కదా! దానికి సాధనమయిన దుఃఖనివృత్తి యుంది. అదికూడా శూన్యమే. కనుక రెండు శూన్యాలూ కలిసి సర్వశూన్య మవుతోందని ఎందుకు అనుకోకూడదు ?

జ: ఏవిధంగా చూపినా శూన్యవాదానికి పురుషార్థత సిద్ధించదు. ఆత్మ శూన్యం కాదు. అది జ్ఞానానుభవ విశేషం. పురుషార్థంలో 'అర్థం' ఉంది. ఉన్నది శూన్య మెట్లా అవుతుంది ?

కనుక నాస్తికవాదానికి ఇందులో తావు లేదు.

## గతి

ప్ర: గతివల్ల బంధం ఎందుకు కలగదు ? ప్రాణి పుట్టి

నప్పట్నుంచే మరణించేదాకా కలిగే జీవితపరిణామంలో (గతి) ఏవేవో అనుబంధాలు సంక్రమించకుండా వుంటాయా? అవి బంధించకుండా ఉంటాయా?

జ: గతి విశేషంవల్ల ఏ మాత్రం బంధం కలగదు గతి శరీరానికే గాని జీవికి లేదు. జీవికి నిష్క్రియత్వం—ఏపనీ చేయకుండా ఉండటం ప్రధాన లక్షణం. కనుక జీవికి గతి లేదు.

కుండలాగ ఆత్మకు కూడ ప్రత్యేక మూర్తత్వం ఉండేటట్లయితే దానికికూడా కుండ ధర్మమే వచ్చేది. ఆత్మకు మూర్తత్వం (personality) లేనందువల్ల దానికి నాశనమూ లేదు.

ప్ర: మీరేమో పురుషుడు నిష్క్రియు డంటున్నారు; మరి ఆత్మకు గతి ఉన్నట్లుగా శ్రుతు లెందుకు చెప్పాయి?

జ: అవును. అవి చెప్పినమాట నిజమే. "పుణ్యేన పుణ్యం లోకం, న యతి పాపేన పాపమ్" నువ్వు పుణ్యం చేసుకుంటే పుణ్య లోకాలకు వెళతావు; పాపం చేసుకొంటే పాపలోకాలకు వెళతావు అవి చెప్పాయి. మీరు ఆత్మకు నిష్క్రియత్వం అనగా ఏమీ చేసుకోలేనితనం ఉన్నదంటున్నారు. అదే నిజమయితే పుణ్యం ఎలా "చేసుకుంటారు" పాపం ఎలా "చేసుకుంటారు". ఎలాగో చేసుకున్నారయ్యా గతి ఉంటేగదా పుణ్యలోకాలకు గాని, పాపలోకాలకు గాని పోవటం?—అన్న సందేహం మీకు కలిగింది. మంచిది.

ఆకాశానికి గమనం ఉందా? లేదు. కాని, మీరు కాశీ కుండని పట్టు కెడుతూ ఉంటే ఆకుండలో ఉన్న ఆకాశం కదులుతున్న ట్లనిపించదా? అది ఆకాశానికి గతేనా?

పుణ్యం చేసేదీ ఆత్మకాదు; పాపం చేసేదీ ఆత్మ కాదు. దానికి నిష్క్రియత్వం ఉంది. ఏపనీ చేయనిదానికి పుణ్యమూ లేదు; పాపమూ లేదు.

అలాగే ఆత్మ నిరవయావి గనుక దానికి గతి కూడాలేదు. ఆకాశానికి అవయవాలు లేవు. దానికికూడా గతి లేదు.

ఏ గతీ లేని ఆకాశంలో మేఘాలు కదులుతున్నప్పుడు ఆకాశం నడుస్తున్నట్లే ఉంటుంది. అది ఉపాధి గమనంవల్ల కలిగిన భ్రమ. ఆత్మ విషయంలో కూడా అలాంటి భ్రమే కలుగుతూంటుంది తప్ప ఆత్మకు అవయవాలు గాని. గతి గాని లేవు

## సత్కర్మలు

ప్ర: సత్కర్మలు చేయటంవల్ల ఆనందం, భోగానుభవం వంటి అదృష్టం లభిస్తుంది. వాటివల్ల బంధం కలుగదా ?

జ: అదృష్టం అనేది పురుషధర్మం కాదు. అదృష్టం అనే మాటకి "కనబడద"ని అర్థం. కనబడని దేదో కలిగించిన ఆనందోపభోగాలు పురుషునికి సంబంధించినవి కావు కావున వాటివల్ల ఏవిధమయిన బంధమూ కలుగదు.

కనబడని దేదో కలిగించిన ధర్మాన్ని అన్యధర్మ మంటాము. స్వధర్మమే బంధహేతువు కాదనుకున్నప్పుడు అన్యధర్మం మాత్రం ఎట్లా అవుతుంది ?

పురుషుడు నిర్గుణుడు అని శ్రుతి చెప్పుచున్నది. ఏ గుణమూ లేని వాడికి అదృష్టం మాత్రం ఎక్కడనుంచి వస్తుంది ?

ప్ర: మీరు మొదట్లో ప్రకృతి పురుషసంబంధంవల్లనే

బంధం ఏర్పడుతుందని చెప్పారు. అదయినా ఒప్పుకొంటారా?

జ: పురుషునికి ప్రకృతి సంబంధం కలిగేమాట నిజమే. అవివేకి అయినవాడు అందులో పడిపోతాడు. ప్రకృతి మోహం వాడిని ముంచేస్తుంది. వివేకి అయినవాడు ప్రకృతిని పరిశీలిస్తాడేగాని, దాని మోహంలో పడిపోడు. కనుక ఈవిషయంలోకూడా బద్ధులు, ముక్తులు సమానం కాదు. ప్రకృతి పురుషులమధ్య కలిగే సామాన్య సంబంధం దోషమూ కాదు; బంధమూకాదు.

## అవివేకం

ప్ర: అయ్యా, అవివేకంవల్లనే బంధం కలిగేటట్లయితే, ముక్తి కలగాలంటే ముందుగా ఆ అవివేకం పోవాలి గదా!

జ: కాంతివల్ల చీకటి తొలగిపోయినట్లే వివేకంవల్ల అవివేకం తొలగిపోతుంది. యోగశాస్త్రంలోకూడా యిలాగే చెప్పబడింది. 'వివేక ఖ్యాతి రవిప్లవా హానోపాయః ఇతి'-అని. వివేకఖ్యాతి మోక్షాన్ని ఎలా కలిగిస్తుందో యోగశాస్త్రాచార్యుడు చెప్పేవున్నాడు.

## ప్రకృతి, పురుష, వివేకం

ప్ర: ప్రకృతి పురుష వివేకంవల్ల ప్రకృతి పురుషులకు మాత్రమే సంబంధించిన అవివేకం తొలగిపోవచ్చు నంటారు, ఇతరేతర అవివేకాలు చాలా ఉన్నాయి. అవేవీపోవనుకో వచ్చా?

జ: ప్రధాన అవివేకం యిదే. ఇది నశించిన తరువాత తతిమ్మా

అవివేకాలన్నీ తక్షణమే నశించిపోతాయి. వాటి గురించి ఆలోచించవలసిన పనిలేదు.

ప్ర: వివేకం వచ్చినా, రాకపోయినా వివేకం గలవాడిని బుద్ధుడని మేము ఒప్పుకుంటాం. అంతమాత్రాన నిత్య శుద్ధ బుద్ధ ముక్తు డెలాఅవుతాడు ?

జ: బంధం, బంధం అంటారు; ఎక్కడుందండీ బంధం ? మాట వరుసకి అనే మాటేగాని నిజంకాదు గదా ? ఏ బంధమయినా చిత్తంలోనే ఉండాలి చంచలమయిన చిత్తానికి బంధం ఏమిటి ?

స్ఫటికంలో కనబడే రంగులేవీ స్ఫటికానివి కావు; వస్తు సామీప్యం వల్ల అవి కలిగాయి. స్ఫటికం వాటి కెప్పుడు దూరమవుతుందో అప్పుడే దానికది పరిశుద్ధ మవుతుంది కనుక దాని నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తత్వాని కేలోటూ ఉండదు.

ప్ర: పురుషునికి బంధాదులు వాక్ మాత్రమే అయినవన్నారు. మంచిదే. దిగ్భ్రమలో పడినవాడికి ప్రత్యక్ష జ్ఞానం కలిగేదాకా, ఎవ రెంతచెప్పినా, తా నెన్నిసార్లు అనుకున్నా, ఆ భ్రమ తొలగదు. అవునా ?

జ: అవును.

ప్ర: ఆ వివేకబుద్ధి ఏ ప్రకృతివల్ల కలుగుతుందో, దాని నెలా సాధించవచ్చో చెప్పండి.

జ: కంటికి కనబడని ఎన్నో సూక్ష్మపదార్థాలు అనుమాన ప్రమాణంవల్ల లభిస్తాయి. పంచభూతాలు, వాటి మాత్రలయిన దేహాదులు మనకు

ప్రత్యక్షంగానే కనిపించినా వాటికి కారణభూతాలయిన ప్రకృతిమహత్తత్వా దులు అనుమాన ప్రమాణంవల్లనే లభిస్తాయి

సత్త్వం రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు ప్రకృతియందు ఇమిడి ఉన్నాయి. ఆకాశం, వాయువు, అగ్ని జలము, భూమి ఈ ప్రకృతికి మూలాధారమయిన పంచభూతాలు వాటినుండి వాక్కు. పాణి, పాదం పాయువు, ఉపస్థ అనే కర్మేంద్రియాలతో కూడిన దేహం ఏర్పడ్డది?

ప్రకృతినుండి మహత్తత్వం పుట్టింది. దానినుండి అహంకారం పుట్టింది. అది కర్మేందిరియాలను వినియోగించుకుంటూ త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణముల ద్వారా స్పర్శ, రూప, శబ్ద, రస, గంధా లను పొంద నారంభించింది. దానినుండి మనస్సు పుట్టింది. ఈవిధంగా ప్రకృతి 25 తత్వాలతో నిండి ఉన్నది.

పురుషుడు వీటిలో దేనినుండీ పుట్టలేదు పురుషునినుండి ఏదీ పుట్టదు. పురుషుడు అనగా జీవుడు స్వయం భౌద్యమాన ప్రవర్దతే. అనగా తనను తాను చీల్చుకొని పరంపరాను గతంగా వృద్ధిపొందుతున్నాడు.

ప్రతీ పురుషుని శరీరంనుండి జీవుడు ఉపస్థ (శిశ్నము, యోని) ద్వారా విడివడి మరోదేహాన్ని పొందుతున్నది.

జీవునకు ప్రకృతిలోని 25 తత్త్వాలు 'గుణాలు' అనిచెప్పబడుతున్నవి. బంధించటానికి పనికివచ్చే త్రాళ్ళనే గుణాలంటాము

ప్ర : ప్రకృతి కారణంగా మహత్తత్వం కలుగుతుందంటే అర్థమయింది. జ్ఞానేంద్రియాలద్వారా లభించిన జ్ఞానమే అహం కారాన్ని కలిగిస్తుంది. కాని, పంచభూతాలకీ జ్ఞానేంద్రియా లకిగల సంబంధాన్ని మీరు ఎలారాబట్టారు?

జ : స్థూలంగా ఉండే పంచభూతాలయొక్క గుణాలు ఈ అయిదు జ్ఞానేంద్రియాలలోనూ ఉన్నవి. బాహేంద్రియాలచేత గ్రహించటానికి వీలయిన గుణాలను ఏది కలిగిఉంటుందో అది స్థూలతను కలిగిఉన్నట్లు. పృథ్విలో గంధగుణ ముంది. కాబట్టి పృథ్వి స్థూలము. దానిని నాసిక మాత్రమే గ్రహిస్తుంది. కావున పృథ్వియొక్క సూక్ష్మగుణం నాసికలో ఉన్నదన్నమాట। అట్టి సూక్ష్మరూపాన్నే 'తన్మాత్ర' అంటున్నాము.

భూమ్యాదులు కార్యపదార్థాలు. వాటికి కారణమయిన సూక్ష్మ పదార్థాలుండాలి. అవే గంధాదులు.

## అహంకారము

ప్ర : అహంకారం వస్తువు కాదు గదా! అదెలా పుట్టింది?

జ : కర్మేంద్రియాలను నడిపిస్తూ, జ్ఞానేంద్రియాలచే పని చేయిస్తూ, జ్ఞానాన్ని సముపార్జిస్తూ నడిపించే దేదో ఒకటి ఉండాలన్న అనుమానంనుండి 'అహంకారం' ఏర్పడించి;

ప్ర : అవును. పశుత్వానికి అహంకారమే వృత్తిగా ఉంటుంది. కాని, మనిషికి మనస్సు...

జ : అవును, మనిషికి మనస్సు, బుద్ధి, చిత్తము అనేవి అహంకారంతోబాటున్నాయి. ఇవన్నీ అంతఃకరణంలో భాగాలు.

జ్ఞానాన్ని సేకరించుకున్నప్పుడు ఆత్మ, సంకల్పించినప్పుడు మనస్సు, నిశ్చయించినప్పుడు బుద్ధి, ఆలోచించేటప్పుడు చిత్తం. ఆక్రోశించేటప్పుడు అహంకారంగా మార్పులుపొందేదానినే అంతఃకరణం అంటాము.

ఇదంతా ప్రకృతియే.

అన్నివస్తువులు కలియటం దేనికోసం ? ఇంకొకదాని భోగం కోసమే గదా ! కనుక ప్రకృతి యావత్తూ పురుషుని భోగంకోసమే ఉన్నదని అనుమానించవలసివస్తుంది.

## మూలప్రకృతి

ప్ర : మీరు మహత్తత్త్వానికి మూలకారణం ప్రకృతి అని రుజువుచేశారు. ఈమూలప్రకృతికి కూడా మూల మేదయి ఉంటుంటో సెలవిస్తే...

జ : మూలే మూలా భావా దమూలం మూలం-మూలకారణమయిన ప్రకృతికి మరో మూలం లేదు. కావున ప్రకృతికి మూలం లేదు గనుకనే అది మూలప్రకృతి అయింది.

'ఈ ప్రకృతికి ఈ ప్రకృతి మూలం' అనుకొంటూ పరంపరను ఊహించినప్పటికీ, ఎక్కడో ఒకచోట ఏదో ఒక ప్రకృతిఅంశతో ఆగిపోక తప్పదు. చివరికి అదైనా మూలప్రకృతి కాకతప్పదు. మూలమయినా, స్థూలమయినా మొత్తమంతా ప్రకృతే కనుక, అనవసరప్రసంగం విడిచిపెట్టి ఈ ప్రకృతికి మరో మూలం లేదనటమే శ్రేయం.

వాది ప్రతివాదు లిద్దరికీ ప్రకృతి ఒక్కటే అయివున్నది. మీరయినా నేనయినా ప్రకృతిపై ఆధారపడి పనిచేస్తున్నవాళ్ళమే.

ప్ర : ప్రకృతి వేరు; పురుషుడు వేరు అనేజ్ఞానం వింటే వస్తుంది. దానికోసం వేరే శ్రమపడవలసిన పని లేదంటాను. ఏమంటారు ?

జ : శాస్త్రాధికారం అందరికీ సమంగా అలవడదు. మందబుద్ధులకు అల్పంగానూ, మధ్యములకు ఒక మోస్తరుగానూ, ఉత్తమద్దులకు సంపూర్ణంగానూ జ్ఞానం కలుగుతుంది. కనుక విన్నంతమాత్రాన ఏజ్ఞానమూ కలగదు. మననం ధ్యానం చేయాలి.

## మహత్తు

ప్ర : ప్రకృతినుంచి మొట్టమొదట పుట్టిందేది ?

జ : మహత్తు అనగా మనస్సు. అదే మొట్టమొదటి కార్యం. మనస్సునుంచి బుద్ధి పుట్టింది. ఆ తర్వాత అహంకారం పుట్టింది. అది పంచతన్మాత్రలయిన జ్ఞానేంద్రియాలను గ్రహించింది. అప్పుడే దానికి పంచభూతములు వ్యక్తమయ్యాయి.

ప్ర : పంచభూతాలుసైతం ప్రకృతినుంచే పుట్టాయంటారా ?

జ : అవన్నీ ప్రకృతిలోని భాగాలే. అణువులనుండి పదార్థం ఏర్పడుచున్నట్లుగానే ప్రకృతినుంచి మహత్త్వాదులు ఏర్పడుతున్నాయి. అహంకారానికి, మనస్సుకి ప్రత్యక్షంగా ప్రకృతి కారణం కాకపోవచ్చు. అయినంతమాత్రాన వాటికి ప్రకృతి ప్రేరణ లేదనలేము.

ప్ర : మీరు ప్రకృతీ, పురుషుడు అను రెండూ నిత్యమన్నారు. కార్యజగత్తు ఈ ఉభయులవల్లా ఏర్పడుతోందన్నారు. అంతేనా ?

జ : ప్రకృతి పురుషులలో ప్రకృతికే పరిణామం ఉన్నది. పురుష

నకు పరిణామం లేదు. కాబట్టి జగత్తుకు ప్రకృతియే కారణమనీ, పురుషుడు కాదనీ చెప్పక తప్పదు.

ప్ర : ప్రకృతే ఈ జగత్తును కల్పించిందనటంకంటే మరేదో పదార్థం దానిని కల్పించిందనకూడదా ?

జ : ఏపదార్థమయినా పరిచ్ఛిన్నమై ఉండాలి. భూమివలె కొంత ప్రదేశాన్ని ఆక్రమించగలదై ఉండాలి. అప్పుడే అది పరిచ్ఛిన్న మవుతుంది. ఏది పరిచ్ఛిన్నమై (కొంత ప్రదేశాన్ని ఆక్రమించి) ఉంటుందో అది ఈ జగత్తులోని సర్వకారణజాతానికీ ఉపాదానకారణం కాలేదు. కనుక ప్రకృతి వంటి మహత్కారణంవల్లనే కార్యం జరుగుచున్నదని చెప్పవలసివస్తున్నది. దాని ఉత్పత్తిని గురించి శ్రుతికూడా చెప్పింది. "అవ్యాకృత ప్రకృతియే నామరూపాలతో వ్యాకృతమయింది" అని శ్రుతి చెప్పింది.

ప్ర : అపరిచ్ఛిన్నత్వం అనగా స్థూల స్వరూపం లేక పోవటంవల్లనే ప్రకృతి ఈ జగత్తుకు కారణమవుతుందంటు న్నారు. పోనీ 'అభావం' కారణమని ఎందు కనుకోకూడదు ?

జ : అభావం అనగా వస్తురాహిత్యం. శూన్యం. 'నా వస్తు నో వస్తు సిద్ధిః' వస్తువుకాని దాని (శూన్యం) వల్ల ఏ వస్తువూ సిద్ధించదు. నాస్తికత్వంవల్ల కార్యసిద్ధి జరగదు. కారణవస్తువునుంచే కార్యవస్తువు పుడుతుంది. కుండకు కారణమయిన మట్టి అనే వస్తు వుంటేనే కార్య మయిన కుండ తయారవుతుంది. శూన్యంనుంచి కుండ పుడుతుందా ? ప్రపంచమనగా పంచభూతాత్మకమయిన గోళం. ఈ మృత్పిండంనుంచే సమస్త కార్యజాతకమయిన ప్రకృతి పుట్టింది. అదే జగత్తయింది.

ప్ర : అవును. ముత్యపుచిప్పలో వెండి కనిపించినట్లు అందుకే ఈ జగత్తును అవాస్తవిక మంటున్నాము.

జ : చీకట్లో చూస్తే ముత్యపుచిప్ప వెండిలా ధగధగా మెరిసి పోయేమాట నిజమే. తెల్లవారి చూస్తే అది ముత్యపు చిప్పేగాని, అందులో వెండి ఉండదు. అదేవిధంగా ఈ జగత్తు వాస్తవంలా కనిపిస్తుందేగాని కాదంటారు. అవునా ?

ఈవిషయాన్నే మరోలా చూడండి. పట్టపగలు మీరు ముత్యపు చిప్పలో కంటా చూశారు. అందులో ఏ వెండీ కనబడలేదు. అదే ముత్యపు చిప్పను మీరు రాత్రి చూడటం జరిగింది. అప్పుడే మీకు అందులో వెండి ఉన్నట్లు భ్రమ కలిగింది. చుట్టూ మీ కట్టుడు అంధకారమో ఉంది. అంధ కారంలో ఉన్నవాడెవడు చూసినా అలాగే కనిపిస్తుంది. ఆ దోషం అంధకా రానిదో, మీ కంటిదోగాని ముత్యపుచిప్పదిమాత్రం కాదు. అలాగే వాస్తవ మయిన జగత్తు మీకు మిధ్యగా కనిపించటంకూడా.

కామెర్ల రోగికి తెల్లని శంఖం కూడా పచ్చగా కనబడుతుంది. అది దృష్టి దోషమే గాని శంఖం దోషం కాదు.

ప్ర : శూన్యంనుంచి పదార్థం ఎందుకు పుట్టదు ?

జ : కారణం వస్తువయితే కార్యం కూడా వస్తువే అవుతుంది. అనగా వస్తువునుంచి వస్తువు పుడుతుంది. కారణం శూన్యం అయితే కార్యం కూడా శూన్యమే అవుతుంది.

ప్ర : కర్మవల్లనే జగత్కార్యం జరుగుతోంది. కనుక కర్మయే జగత్కారణ మనుకోవచ్చా ?

జ : కూడదు. కర్మ జగదుత్పత్తికి నిమిత్త కారణ మవుతుందే గాని ఉపాధాన కారణం (means) కాదు. కనుక కర్మవల్ల జగదుత్పత్తి జరగదు.

## వివేకం

ప్ర : జగదుత్పత్తికి కర్మయే నిమిత్తమయితే, దాని వల్లనే మోక్షం కలుగవచ్చు. మధ్యలో వివేకం ఎందుకు ?

జ : ఈ వైదికకర్మలవల్ల మోక్షం సిద్ధించదు కర్మ వల్లనే మోక్షం సిద్ధించేటట్లయితే క్షణక్షణానికీ మనంచేసే కర్మపరంపరవల్ల మోక్షపరంపర కూడా ఏర్పడుతూ వుండాలి. అలాంటి మోక్షం క్షణికమే గాని నిత్యం కాదు. కర్మఫలంవల్ల స్వర్గం పొందినా చేసుకున్న పుణ్యం క్షీణించగానే మళ్ళీ మానవలోకానికి వచ్చేస్తారని కర్యాణ్యులే చెబుతున్నారు. క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి. కనుక కర్మలవల్ల అల్ప ఫలమేగాని తరగని ఫలం లభించదు.

ప్ర : ఉపాసన ద్వారా ముక్తులయినవా రున్నారు. వారికి పునరావృత్తి ఎందుకు కలగదు ?

జ : మననం మోక్షసాధన మనేమాట నిజమే అందులో వివేకం గలవారికే పునరావృత్తి (తిరిగి రావటం) (resurrection) జరుగదు.

ప్ర : ఆపాటిదానికి పుణ్యాపాప కర్మలంటూ దేనికి ? వాటిఫల మేదీ లేదా ?

జ : రోగికి పన్నీటి స్నానం రోగాన్నే కలిగించినట్లు కర్మలవల్ల దుఃఖపరంపర మాత్రమే కలుగుతుంది. అసలు జాడ్యం ఎన్నటికీ పోదు.

ప్ర : కామ్యకర్మలవల్ల దుఃఖం కలగవచ్చు. నిష్కామ కర్మలవల్ల కూడా దుఃఖం కలుగుతుందంటారా ?

జ : మీరు నిప్పును మనసారా కోరి ముట్టుకున్నా, పరాకున ముట్టుకున్నా ఒకలాగే కాలుతుంది గదండీ! వివేకం లేకనే యజ్ఞాలు, దానాలు, మంత్రాలు అంటూ కొందరు తడుముల్లాడుతున్నారు. వారికి దుఃఖమే మిగులుతుంది.

నిజంగా వివేకంవల్ల ముక్తుడయినవాడికి ఆత్యంతమయిన బంధ నివృత్తి కలుగుతుంది. వాడికి సమానత్వం ఉండదు

## ప్రమాణం

ప్ర : ప్రకృతి పురుష వివేకం మోక్షోపాయ మని చెప్పారు సంతోషం. దీనిని ప్రమాణపూర్వకంగా నిశ్చయించవలసివుంది. ఇంతకీ ప్రమాణ మంటే ఏమిటి ?

జ : మనస్సుకి గాని, బుద్ధికిగాని తెలియని వస్తువుకు సంబంధించిన జ్ఞానం సమగ్రంగా కలగటాన్నే 'ప్రమ' అంటాము ఆట్టి ప్రమకు సాధనమైనదానినే ప్రమాణం అంటాము. అది మూడు రకాలుగా ఉంది. ఆ మూడూ సిద్ధించినట్లయితే సర్వమూ సిద్ధిస్తుంది.

ఏది వస్తువుతో సంబద్ధమై దాని ఆకారాన్ని మనస్సులో ఉల్లేఖిస్తుందో అది ప్రత్యక్ష ప్రమాణమని చెప్పబడుచున్నది.

ప్ర : యోగులు ప్రత్యక్షంగా లేనివాటిని కూడా తమ దివ్యదృష్టితో చూడగలరట ?

జ : అది వారి స్వంత కంటితో జరిగే పనికాదు. కాబట్టి మేము చెప్పింది తప్పులేదు. అది వారి యోగశక్తి. ఆ శక్తితోనే వారు గత, ఆగత వస్తువుల్ని దర్శించగలరు. వర్తమాన వస్తువుల్ని దర్శించటానికి

వారు కళ్ళు తెరుచుకొని చూస్తే చాలు. ప్రత్యక్ష వస్తువుకనిపిస్తుంది గత అనాగత వస్తువులు ఎలాగూ ప్రత్యక్షం కావు కనుక వాటి ప్రసక్తి యిప్పుడు అవసరం లేదు.

ప్ర : ఈశ్వరునికి ప్రత్యక్షజ్ఞానం ఏ యింద్రియాలు పనిచేయకుండానే కలుగులుతుంది గదా?

జ : ఈశ్వరా సిద్ధేః- ఈశ్వరుని ప్రసంగం యిక్కడ అవసరం లేదు.

ప్ర : ఎందుచేత?

జ : ముక్తులు, బద్ధులు అయిన పురుషులగురించి మాత్రమే మనం చర్చించుకొంటున్నాం. కనుక ఈశ్వరప్రమేయం లేదు. బద్ధుడయినా, ముక్తుడయినా మానవుడు జగత్తును ఉత్పత్తి చేయలేడు. అది ఈశ్వరునికే సాధ్యమయింది.

ప్ర : ముక్తిని పొందిన ఆత్మయే ఈశ్వరుడని యోగములందు ప్రశంసింపబడింది; ఉపాసనద్వారా ఈశ్వరత్వాన్ని పొందగలరని ఆగమములందు వర్ణింపబడింది. అదంతా అబద్ధమేనా?

జ : ముక్తిని పొందిన జీవుడికి దుఃఖరాహిత్యం కలుగుతుంది. అంతవరకూ ప్రశంసనీయమే. అలాగే యోగాభ్యాసంవల్ల సిద్ధిని పొందిన వారికి గొప్ప ఉపాసనాశక్తి కలిగి కొన్ని మహత్యాలుకూడా కలుగుతాయి. అంతమాత్రాన ఎవరికీ ఈశ్వరత్వం సిద్ధించదు. కైవల్యం పొందిన యోగి ఇంద్రియాలతో నిమిత్తం లేకుండానే సర్వజ్ఞత్వాన్ని పొందగలడని యోగ

శాస్త్రం చెప్పింది. అది సత్యం కాదు. ఎన్ని సిద్ధులు పొందినా మానవుడు మానవుడే గాని ఈశ్వరుడు కాడు. కనుక తాను యోగీశ్వరుడ నని గాని, కవీశ్వరుడ నని గాని అనుకోవటం హాస్యాస్పదం. పరమేశ్వరు డొక్కడే సర్వజ్ఞుడు.

ప్ర : ఈశ్వరుడు నిత్యశుద్ధుడు, బుద్ధుడు, ముక్త స్వభావుడే గదా! అతనికి ప్రకృతిమీదనూ, పురుషునిమీదనూ అధిష్ఠానం (command) ఎలా వచ్చింది ?

జ : అయస్కాంతానికి దగ్గరగా ఉన్న ఇనుము దానిచే ప్రేరేపింపబడుచున్నట్లు ప్రకృతియు, పురుషుడు ఈశ్వరసన్నిధానంవల్ల ప్రేరేపింపబడుచున్నవి. కనుకనే ఈశ్వరునికి అధిష్ఠాతృత్వం (నియంతృత్వం) లభించింది.

సాంఖ్యుల మతంలో ఈశ్వరుడు సర్వజ్ఞుడు; సర్వశక్తిమంతుడు. ఈశ్వరత్వానికి సమానంగాని, అంతకన్న అధికంగాని లేదు ప్రకృతి పురుషులతో ఈశ్వరునికి గల సాక్షాత్ సంబంధమే సన్నిధి అని చెప్పబడుచున్నది. సన్నిధివల్ల ఈశ్వరునికి ప్రకృతిపురుషులపై అధిష్ఠానం (command) సిద్ధించింది. ఈ సంబంధము సంయోగసంబంధంగాని, సమవాయసంబంధంగాని కాదు. స్వస్వామిభావ సంబంధం. ఈశ్వరుడు స్వామి. ప్రకృతి పురుషులు ఈశ్వరుని అనుచరులు. ఇవి నిత్యం.

## చైతన్యం

ప్ర : చైతన్యమే ఐశ్వర్యం కనుక చైతన్యవంతుడయిన జీవుడు తన సంకల్పంవల్ల ప్రకృతి కేల అధిష్ఠాత కాకూడదు?

జ : మానవుడు సంకల్పంవల్ల దేనిపైనా అధిష్టానం పొందలేడు, బుద్ధిబలంవల్ల విశేషకార్యాలను సాధించగలడు. బుద్ధి సన్నిధివల్లనే సంకల్పంగాని, కార్యదీక్షగాని, యత్నసిద్ధిగాని లభిస్తున్నవి. వ్యోమయానాదులు ఈవిధంగా సిద్ధించినవే. బుద్ధివల్ల సిద్ధించినవి బుద్ధిసిద్ధులేగాని ఈశ్వరత్వం కాదు. సమస్త ప్రకృతి మానవుని ఇష్టానుసారం వర్తించటం జరగదు.

ప్ర : బుద్ధి సరిగా పెరగని ఆదిమమానవుడికి వాక్యార్థోపదేశం ఎలా కలిగింది ?

జ : ఉపదేశంలోనే వాక్యాన్ని అనుసరించి అర్థం వుంటుంది. కనుకనే బోధింపబడటం సిద్ధించింది.

అగ్నిచేత దహింపబడిన యినుము కూడా ఉజ్జ్వలంగా ప్రకాశించినట్లు చైతన్యంచేత బుద్ధికూడా ప్రకాశవంతమై అధిష్ఠాతృత్వాన్ని పొందుతుంది. కనుక కొంతలో కొంత ప్రకృతిని అధీనం చేసుకోగలుగుతుంది.

పరమేశ్వరునికి సమస్త ప్రకృతీ ప్రత్యక్షవస్తువైనందున అధీనమైనట్లే ఈశ్వరచోదితమయిన బుద్ధికికూడ సమీప ప్రత్యక్షవస్తువుపై అధిష్ఠాతృత్వం లభిస్తుందని సారాంశం.

## అనుమానం :

ప్రతిబంధమంటే నియత సంబంధం. అగ్నికీ పొగకీ ఉండే సంబంధాన్నే ప్రతిబంధసంబంధం అంటాము ప్రతిబంధసంబంధం వలన ప్రతిబద్ధమయిన (అనగా బంధింపబడిన) జ్ఞానాన్నే అనుమానం అంటాము.

ఇది బుద్ధి వృత్తివల్లగాని లభించదు. ఇది పౌరుషేయ బోధ. పురుషుని ప్రభావంవల్ల కలిగే అవగాహన.

శబ్దం :

ఉన్నది ఉన్నట్లు చెప్పటమే ఆప్తి. అలా చెప్పేవాడు ఆప్తుడు. అలాంటి వాక్యమే ఆప్తోపదేశం. అట్టి శబ్దం కూడా ప్రమాణమే.

ప్రమాణాలు

ప్ర : ఈ ప్రమాణా లెందుకు ?

జ : శబ్దప్రమాణంవల్ల నామవాచకమయిన పదము, దానికి సంబంధించిన అర్థము గోచరించి పదార్థ జ్ఞానం లభిస్తుంది.

అలాగే సామాన్యవత్తని చెప్పబడే అనుమానం ఉన్నది. పదార్థం యొక్క రంగు, రుచి, వాసన, వేడిమి, ధ్వని మున్నగు గుణాలనుబట్టి ఆ పదార్థం ఏమిటో నిర్ణయిస్తాము, ఈ పద్ధతినే సామాన్యవత్తని పేరు. దీనివల్లకూడా పదార్థమూ, దాని గుణాలు లభిస్తాయి.

ఈవిధంగా శబ్దపూర్వక పదార్థాన్నీ, గుణాత్మక పదార్థాన్నీ సంభావించటమే 'భోగ'మని చెప్పబడుచున్నది. అదే బుద్ధికి పర్యవసానం.

ఇవేవీ పురుషసంకల్పంవల్ల జరిగే పనులు కావు. బుద్ధి పనిచేయటంవల్ల లభించే ఫలాలు మాత్రమే. వంటవాడు వండిన అన్నాన్ని యజమాని తిన్నట్లు బుద్ధి సాధించిన ఫలాన్ని పురుషుడు అనుభవిస్తాడు.

బుద్ధియందే పురుషుడు రమిస్తాడు కనుక బుద్ధికి కలిగిన విషయావబోధమ పురుషుడు గ్రహిస్తాడు. కనుక తనకు తెలుసునన్న అహంకారం కలుగుతుంది. ఇది అవివేక ఫలం.

వివేకం కలగగానే పురుషునికున్న కర్తృత్వమూ, భోక్తృత్వమూ-రెండూ నశించిపోతాయి. అప్పుడు అహంకారమే ఉండదు.

ప్ర : ప్రత్యక్షంగా లేనిపదార్థాలను లేవనుకోవచ్చా?

జ : అవి పదార్థాలే అయితే ప్రత్యక్షంగా లేకపోయినా ఉంటాయి. అతి దూరంగా ఉన్న వస్తువులుగాని. అతి దగ్గరలో ఉన్న వస్తువులుగాని కనబడకపోవచ్చు. మన ఇంద్రియాలే చెడిపోవచ్చు. మనస్సుకు స్థిమితం లేకపోవచ్చు. ఆ పదార్థాలు అణువంత చిన్నవి కావచ్చు. ఈరకం ఆటంకాలున్నప్పుడు పదార్థాలుండికూడా కనబడవు. కాబట్టి ప్రత్యక్షంగా లేని పదార్థాలను లేవనుకో కూడదు.

ఆటంకాలు

ప్ర : ఏరకం ఆటంకాలుండేఅవకాశం ఉంది ?

జ : 1. అతి దూరం : అరుంధతి నక్షత్రం కన్నా దూరంగా ఉండేనక్షత్రాలు కనబడవు కదా :

2. అతి సామీప్యం : కంటికి అతి సమీపంలో ఉన్న పుసుగు కనబడదు.

3. ఇంద్రియఘాతం : కన్నుకు దెబ్బతగిలితే గ్రుడ్డి కన్ను దేనినీ చూడలేదు; అలాగే చత్వారం ఉండటంవల్ల దగ్గర వస్తువులు అనవు.

4. మనశ్చాంచల్యం : పిచ్చెత్తినవాడికి ఏమి కనిపిస్తుంది ?

5. సూక్ష్మత : అణువునీ, పరమాణువునీ చూడగల శక్తి కళ్ళకు లేదుగదా :

6. వ్యవధానం : కడుపులో ప్రేగులు కనబడకుండా చర్మం అడ్డగించింది. ఆ రకం అడ్డం.

7. అభిభవం : దీపం వెలుగు ఎండలో తిరస్కరింపబడుతుంది గదా !

8 సమానాభిహారం : సమానజాతీయతవల్ల వేర్పడలేకపోవుట. ఆవుపాలలో గేదెపాలు కలిసిపోయినట్లు.

ప్ర : పురుషుడు ఇంద్రియాలకు లభించకపోవటానికి కారణమేమిటి ?

జ : సూక్ష్మత.

ప్ర : అంత సూక్ష్మమయినది ఉందనుకోవటంకంటే లేదనుకోవడమే మంచిది కదా ?

జ : అతి సూక్ష్మమయిన అణువుల్ని లేవను కొంటున్నామా ? అవే లేకపోయినట్లయితే భూమి, అగ్ని, నీరు, వాయువు, ఆకాశం ఉంటాయా ? పంచభూతాత్మకమయిన ఈ జగత్తు, ప్రకృతి లభిస్తాయా?

ఇన్ని కనిపిస్తున్నప్పుడు ఈ ప్రకృతికి కారకుడు, భోక్త అయిన పురుషుడొకడు (పరమేశ్వరుడు) లేడనుకోగలమా ?

కార్యదర్శనంవల్లనే కారణం కనిపిస్తున్నది.

ప్ర : రకరకాల వాదాలున్నాయి. వాటిల్లో వాటికి విరోధాలున్నాయి. కనుక పరమేశ్వరుడు సిద్ధింపక పోవచ్చు గదా !

జ: అవును. బౌద్ధులు ఈ జగత్కారణం శూన్యమంటారు. అద్వైతులు బ్రహ్మ (Dynamic Force) అంటారు. చార్వాకులు పరమేశ్వరుడే లేడంటారు. కొందరు పరమాణుసముదాయమంటారు.

ఎవరేమిఅన్నా సమస్త ప్రకృతికీ అంతర్గతంగా ఉన్న కార్యకారణ సంబంధాన్ని వారు కాదనలేరు. ప్రతీ కార్యానికీ కారణ వస్తువు సిద్ధిస్తున్నందువ ఇట్టి కార్యకారణ భావమే మూలప్రకృతి అని చెప్పటం అపలాపం కాదు.

దానికి శ్రుతివిరోధంగాని, స్మృతివిరోధంగాని, తార్కికగతికి సంబంధించిన న్యాయ విరోధంగాని లేదు.

ఉత్పత్తికి పూర్వం వస్తువు లేదని సాంఖ్యుల సత్కార్యవాదం చెపుతుంది. తయారుకాక పూర్వం కుండ ఉండదు కదా! దానికి ఉపాదాన కారణమయిన మట్టి మాత్రమే ఉంటుంది. కనుక ఏ కార్యానికయినా ఉపాదాన కారణం ఉండాలి; ప్రకృతి సత్కార్యమే గాని అసత్కార్యం కాదు. సత్కార్యమయిన ప్రకృతికి ఉపాదాన కారణమేది? దేని, వేని, ఎవని యిచ్ఛవల్ల ప్రకృతి కార్యరూపం ధరించింది?- అని మనం ఆలోచించినట్లయితే ఒక పరాశక్తి స్ఫురిస్తుంది. అదే పరమేశ్వరుడు.

మనిషిని పశువంటాము. పశువులకు కొమ్ము లుంటాయి. మనిషికెందుకు ఉండవు? మనిషిలో కొమ్ము పుట్టుటకు ఉపాదాన కారణం లేకపోవటంవల్లనే. అందుకే ఉపాదాన నియమం చెప్పవలసి వస్తున్నది.

అదిగాక, ప్రతీకారణంనుంచీ ఎల్లప్పుడూ అన్నికార్యాలూ పుట్టవు. అలా పుట్టటానికి ఉపాదాన కారణం ఉంటేనే పుడతాయి. మట్టిలో లేని కుండ, మట్టినుండి ఉత్పన్నమవుచున్నట్లే, మట్టిలో లేని బంగారపు నగలు

మట్టినుండి ఎందుకు ఉత్పన్నం కావు? వాటికి ఉపాదాన కారణం ఆ మట్టిలో లేదు కనుక।

మట్టి కుండగా మారటానికి మానవశక్తియే ప్రధానకారణ మవు తున్నది. అట్టి శక్తికి ఆశ్రయ కారణం శక్త మవుతున్నది.

ఉపాదాన కారణ మయిన మట్టి, శక్తివల్ల ప్రేరేపింపబడి కుండగా మారినట్లు. పంచభూతాత్మకమయిన సృష్టి పరాశక్తిచే ప్రేరేపింపబడి ప్రకృతిగా మారటం గమనిస్తున్నాం.

కుండ తయారుకావటానికి మట్టి ఒక్కటీ ఉంటే చాలదు. దానిపై ప్రయోగింపబడె శక్తికూడా ఉండాలి. అంతేకాదు. కుండ ఉత్పత్తి కాక ముందే కుండ రూపురేఖలకు సంబంధించిన భావనకూడా ఉండాలి. అది అసత్తు. అసత్కార్యం ఊహలో కుండ అది సత్కార్యానికి, అనగా నిజమైన కుండకి ప్రేరకకారణమవుతున్నది. ఉపాదాన కారణం లేకుండా అసత్కార్యరూపమయిన ప్రేరకకారణం కార్యరూపాన్ని ధరించ లేదు. అనగా మట్టి కుండనుచేయాలన్న ప్రయత్నం (శక్తి) లేకుండా కుండలు తయారుకావు.

కార్యానికి ముందే భావం (imagination) ఉంటుంది. భావ యోగంవల్ల ఉత్పత్తి సంబంధం మాత్రమే ఏర్పడుతుంది. అది ఏర్పడిన తర్వాతనే కార్యం (కుండ తయారుకావటం) జరుగుతుంది. కనుక భావం వల్ల ఉత్పత్తి జరగదనుకోకూడదు

ప్ర: ఉత్పత్తికి ముందు కుండకు సంబంధించిన భావన కలుగుతోంది. అనగా కుండ ఉత్పత్తి అయినట్లే కదా? మన సులోనే అవచ్చు. కార్యానికి ముందే భావంలో ఉత్పత్తి అయిన కుండ ఆ తర్వాత నిజంగా ఉత్పత్తి అయింది.

పూర్వం లేనిది క్రొత్తగా ఏర్పడితేనే 'కార్యం' అంటాము. ముందుగానే మనసులో ఏర్పడిన తరువాత భౌతికంగా పుట్టినదానిని సత్కార్యవాదులు అంగీకరిస్తారా ?

జ ; ఉత్పన్నం అయిందనో, ఉత్పన్నం కాలేదనో చెప్పే వ్యవహారాలు, అవ్యవహారాలు అభివ్యక్తినిమిత్తకాలేగాని, ఉత్పత్తి నిమిత్తికాలు కావు.

మట్టినుండి కుండ పుట్టినంత మాత్రాన కుండకూ మట్టికీ సంబంధం లేదనుకోకూడదు. అలా అని ఆ రెండూ ఒకటి కావు. కుండమట్టి వేరు; కుండపెంకు వేరు-అవి రెండూ కలియవు.

కనుకనే సాంఖ్యులు 'ఉత్పన్నం' (పుట్టుట) అనే మాటను ఒప్పుకోరు. మట్టినుండి కుండ అభివ్యక్తమయింది. అనగా రూపొందిందని అంటారు మట్టినుంచి కుండ రూపొందింది; రూపొంద లేదు. -ఇంతే. ఇది అవస్థాంతరాన్ని చెపుతుంది. ఒకే వస్తువుయొక్క పరిణామం.

ప్ర : అలా అయితే కార్యం అనాది అని చెప్పాలి. కార్యం నుంచి కార్యం ఉత్పన్న మవుతున్నట్లే గదా ? ఒక కార్యం మరో కార్యానికి కారణమవుతున్నది. ఈవిధంగా కార్యకారణ భావాలు ఏర్పడి కార్యపరంపరయే అభివ్యక్తమవుతున్నదని అనుకోవాలి.

జ : కారణంలోనే కార్యం ఉన్నంతవరకూ కార్యం లేదు. దానిని కారణలయత్వం అంటాము.

అది విధ్వంసస్థితి కాదు. అవ్యక్తస్థితి. అనగా కార్యం వ్యక్తం కాకుండా ఉన్న స్థితి. కుండమట్టినుంచి యింకా కుండ తయారు కాలేదు.

అయినా అది కుండమట్టే. ఇందులో కుండ అవ్యక్తం (unexpressed)గా ఉంది. ఇదొక అతీతావస్థ. కారణంనుండి కార్యం విభజింపబడని దశ. కుండమట్టినుండి కుండ ఏర్పడని స్థితి.

ఇక కార్యంనుండి కార్యం పుడుతుందన్న వాదం సరియైనది కాదు. కుండ ఉత్పత్తికి మట్టి కారణమే కావచ్చు. మట్టికూడా మీరన్నట్లు కార్యమే. దానికి కారణమయిన కార్య మేది? దానికి కారణమయిన కార్య మేది?........

ఈవిధంగా వెతుక్కొంటూ పోతే కార్యపరంపర ఏర్పడవచ్చు. ఇదెలా ఉందంటే విత్తు ముందా? చెట్టు ముందా?- అన్నట్లుంది. ఎప్పటికీ ఈ సందేహం తీరదు కనుక ఒక కార్యానికి మరో కార్యం కారణమవుతుందన్నంతవరకూ ఆపివేయటం మంచిది.

మనకు కావలసింది కార్యరూపమే. దానికి మూలమయిన కారణముస్నా. సమస్త కార్యాలకూ మూలభూతమయిన ప్రకృతి కనిపిస్తుంది. ఏకార్యానికయినా అభివ్యక్తికి పూర్వదశలో ఉండే కార్యమే కారణమవుతుంది. గనుక దానిలో కార్యకారణ భేదం లేదనుకోవచ్చు.

ప్రకృతి వ్యక్త కార్యమే గదా! దానికి లింగం (శరీరం) ఉంది. కారణం ఉంది. అనిత్యత్వం ఉంది. అది వ్యాపించ లేదు. క్రియావంతమయి ఉంది. అనేకంగా ఉంది నానా ఆశ్రితంగా ఉంది.

ప్రకృతిని ప్రధానంగా శాస్త్రకారులు చెప్పారు. ప్రధీయతే లీయతే కార్యజాతమ్ అస్మిన్ ఇతి ప్రధానమ్ అని నిర్వచనం. కార్యపదార్థాలన్నీ ఎందులో లీనమవుతాయో అది "ప్రధానం" అని వ్యుత్పత్తి. కార్యపదార్థాలన్నీ సుఖదుఃఖాలతో నిండి ఉన్నాయి కనుక ఆరకం సామాన్యగుణాలన్నీ ప్రకృతిలోనూ యిమిడి ఉన్నాయి.

చైతన్యానికి ప్రతీకలయిన సత్త్వ, రజస్, తమోగుణాలు మూడూ ప్రకృతిలో అంతర్లీనంగా ఉన్నాయి. విషయత్వం, సమానత్వం, పరిణామిత్వం మున్నగునవి కార్యకారణాలకు సమానధర్మమై ఉన్నాయి.

ప్ర : సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం అను మూడింటికీ సాధర్మ్యం ఏమిటి, వైధర్మ్యమ్ ఏమిటి ?

జ : సత్త్వగుణమూ, తమోగుణమూ పైకి ఒక్కలాగే కనిపిస్తాయి. అయితే తమోగుణం అవివేకంవల్ల కలిగినదయితే, సత్త్వగుణం వివేకంవల్ల కలిగినదవుతుంది. అలాగే సత్త్వగుణమూ, రజోగుణమూ చైతన్యవంతాలుగానే కనిపిస్తాయి. కాని రజోగుణంలో ఉన్న అహంకారం గాని, ఆవేశంగాని సత్త్వగుణంలో లేవు. ఇవీ సాధర్మ్య వైధర్మ్యాలు. సుఖదుఃఖాలు, సంతోష విచారాలు వంటి పరస్పర విరుద్ధగుణాలులేవా ? వాటితోనే ఈ ప్రకృతి నిర్మించబడింది. అలాగే తేలికవస్తువులు కొన్ని: బరువైనవి కొన్ని, సూక్ష్మమైనవి కొన్ని, స్థూలమైనవి కొన్ని అన్నిటికి ఎంతో కొంత పరిమాణం ఉన్నది. అవి అనుభవనీయాలు. ఏవి పుడతాయో అవి కార్యాలు అవి గిడతాయి. ఒకదానితో ఒకటి సమన్వయాన్ని పొందగలవు. అన్నిటిలోనూ శక్తి ఎంతో కొంత ఉంది.

మహత్తు, బుద్ధి, అహంకారము మున్నగునవన్నీ కార్యాలే. అవి కూడ నశిస్తాయి.

కాకపోతే ప్రకృతి పురుషులవలె కార్యపదార్థాలు కూడా నిత్యమై ఉండాలి. అవి అలా లేవు. ప్రకృతి, పరమేశ్వరుడు మాత్రమే నిత్యమై ఉన్నారు. ఆ రెండూ కాక మరేదీ నిత్యంకాదు.

ప్రశ్న : పుడుతూ గిడుతూ ఉన్న కార్యాలు తప్ప

మీరు చెప్పిన ప్రకృతీ కనబడటం లేదు, పరమేశ్వరుడూ కనబడటం లేదు.

జ : ప్రకృతి కార్యాలను చూస్తున్నాం కదా! కార్యాన్ని చూడగానే కారణాన్ని గ్రహించగల ధీశక్తి ఉండాలి. దానికి అసాధ్యమయినదిలేదు.

దీని విషయంలో వివాదం అవసరం లేదు. వస్తువులను చూపి దాని ధర్మాన్ని సాధించినట్లుగానే ప్రాకృతిక కార్యాలను చూసి ప్రకృతిని సాధించటం సర్వసామాన్యమయిన విషయమే. చైతన్యాన్ని ఎవరూ చూడ లేరు గదా! కాని అదేదో ఉన్నదని అందరూ గ్రహించారా లేదా?

అలాగే పురుషుడు శరీరాదులకు వ్యతిరిక్తుడు. అనగా శరీరం నుంచి ప్రకృతి వరకూ గల అన్ని పదార్థాలకన్నా భిన్నుడు. శరీరంవేరు, పురుషుడువేరు శరీరం యితరుల భోగం కోసమే ఉద్దేశింపబడింది. అందుకే అది సంహతమని చెప్పబడింది.

సత్త్వరజస్తమో గుణాలున్నాయి. వాటికి విరుద్ధమైన చైతన్యమే పురుషుడు. ఇది శరీరాన్ని అధిష్ఠించి ఉంటుంది. ఈ చైతన్యంలేని శరీరమే శవం. ఈ చైతన్యమే శరీరాన్ని అనుభవిస్తూ ఉంటుంది. అయినా దానికి మోక్షప్రవృత్తి ఉండటంవల్ల అది వేరు, శరీరంవేరు అని రుజువవు తున్నది. స్పృహతప్పిన శరీరంలో చైతన్యం ఉండదుగదా!

## ప్రకాశం

ప్ర : శరీరానికి ప్రకాశం ఉంది; చైతన్యంవల్ల ప్రకా శం వస్తుంది. ప్రకాశమే పురుషుడు.

జ : గాఢమైన శరీరం నుండి కూడా ప్రకాశం (Brightness) కనిపిస్తుంది కనుక ప్రకాశం పురుషుడుకాదు. నిర్గుణత్వం చైతన్యంకాదు.

ప్ర : చైతన్యం జ్ఞానంవల్ల కలిగేదయితే దానికి జ్ఞానమే ధర్మంకావాలి గదా !

జ : చైతన్యం నిర్గుణమైనది. కనుక చైతన్యానికి జ్ఞానమే ధర్మమని చెప్పకూడదు.

కాని చైతన్యానికి జ్ఞానస్వరూపం ఉందని శ్రుతులు చెప్పాయి. స్వరూపంవేరు. ధర్మంవేరు చైతన్యానికి ధర్మమంటూ లేదు.

ప్ర : చైతన్యం జ్ఞానస్వరూపమే అను శ్రుతివాక్యాన్ని అంగీకరించి, అది ధర్మం కాదనటం సమంజసంగా లేదు.

జ : చైతన్యం (పురుషుడు) జ్ఞానస్వరూపమేగాని, జ్ఞానదాత కాదనటంలో అర్థం ఉంది. జ్ఞానమే పురుషునికి ధర్మ (గుణం) మయిన పక్షంలో జాగ్రదవస్థనీ, స్వప్నావస్థనీ ఎలా చూడగలరు ?

ఇంద్రియాలద్వారా బుద్ధి,విషయాలనుగ్రహించే సమయాన్నే జాగ్రదవస్థ అంటున్నారు. సంస్కారాల (మానసిక ముద్రలు) వల్ల బుద్ధి పొందే విషయాకారపరిణామాన్ని స్వప్నమంటున్నారు.

ఈ అవస్థలలో బుద్ధిపొందుతున్న వృత్తు లన్నింటికీ పురుషుడు సాక్షిగా ఉంటున్నాడు.

ఇదీ పురుషస్వరూపం.

పురుషబహుత్వం

ప్ర : పురుషు పుట్టేవాళ్ళు పుడుతున్నారు. చచ్చే

వాళ్ళు చస్తూనే ఉన్నారు. ఈ జన్మాది వ్యవస్థనుబట్టి చూస్తే పురుషులు చాలామంది ఉన్నట్లు తోస్తోంది.

జ : ప్రతీ కుండలోను ఒకే ఆకాశం కనిపిస్తుంది. కాని అది కుండకో ఆకాశంలా కనిపిస్తుంది. ఈ రకం బహుత్వం భ్రాంతిజనకమే గాని సత్యం కాదు. ప్రతీశరీరానికీ తలో పురుషుడూ ఉంటా డనుకోవటం ప్రతీ కుండకీ ఆకాశం వేరనుకున్నట్లే అవుతుంది. ఈ కుండల్ని ఉపాధు లనుకుందాం. ఉపాధేయమయిన ఆకాశం ఒక్కటే కదా! అలాగే శరీరాలు వేరయినా వాటికి ఉపాధేయమయిన పురుష డొక్కడే

ప్ర : చైతన్యమే పురుషు డన్నారు. చైతన్యం అందరి లోనూ ఒకే స్థాయిలో లేదు గదా! కనుక పురుషులందరూ సమం కాలేరు.

జ : చైతన్యం శరీరాన్ని ఆశ్రయించి ఉందేమాట నిజమే. ఆ ఉనాధిలో ఉండే దోషంవల్లనే చైతన్యం సరిగా లేకపోవచ్చు. ఆ దోషం చైతన్యానిది కాదు. కాంతి ఒకటే అయినా తెల్లని స్వచ్ఛమైన అద్దంలోంచి వచ్చినంత స్వచ్ఛంగా రంగు అద్దాలలోంచి రాదు.

ప్ర : చైతన్య పురుషుడు ఒక్కడే అయినా భిన్నభిన్న శరీరాలతో కూడినందున భిన్నత్వం పొందుతున్నాడు.

జ : శరీరాలు వేరవుతాయి గాని చైతన్యం వేరవదు.

నానాశరీరాలలో ఉండేది ఒకే చైతన్య మయినప్పుడు శరీరాలు పుడుతూ, చస్తూ ఉండవచ్చు గాక! చైతన్యానికి చావు ఉండదు. సుఖ దుఃఖాలవంటి విరుద్ధధర్మాలు కూడా దానికి అంటవు.

ప్ర : సుఖదుఃఖాలు శరీరానివే గాని చైతన్యమూర్తి అయిన పురుషుని కంటవని గదా మీరంటున్నారు. శారీరక మయిన సుఖదుఃఖాలు శరీరధారికి సంబంధించకుండా పోవు. కాలికి ముల్లుగుచ్చుకొంటే ప్రాణం కడగంటినంత బాధ కలుగుతుంది గదా !

జ : అనన్యధర్మాలు ఆరోపింపబడినందువల్లనే అవి పురుషునకు కలిగినట్లు భ్రమింపబడుచున్నాయి. శుద్ధ చైతన్యానికి సుఖదుఃఖాలంటూ లేవు.

ప్ర : పురుషుడు వేరు; శరీరం వేరూ అయినప్పుడు అద్వైతాన్ని బోధించే శ్రుతివాక్యాలన్నీ వ్యర్థం కావా ?

జ : శ్రుతులు పురుషజాతిని ఉద్దేశించి ప్రసంగించాయి. జాతి అనేది ఒకటే గాని రెండు కాదు గదా ? కనుక అద్వైత శ్రుతి విరోధం లేదు.

ప్ర : ప్రత్యేకకారణాన్ని బట్టి పురుష బహుత్వాన్ని ఎందుకు అంగీకరించకూడదు ?

జ : బంధకారణం శరీరమే అని తెలిసినవాడికి మనిషి మనిషికీ కనిపించే తేడా శరీరానిదే గాని చైతన్యానిది కాదనిపిస్తుంది.

ప్ర : అలా ఎందుకు కనపడదు ?

జ : గుడ్డివాడికి కనబడకపోవచ్చుగాని కళ్ళున్నవాడికి ఉపలంభం కాకపోదు.

ప్ర : వామదేవుడు మున్నగువారు ముక్తులయ్యారని విన్నాం- అందరూ ముక్తులు కాలేదే ? కొందరు ముక్తులవటం కొందరు కాకపోవటం పురుష భిన్నత్వంవల్లనే కలుగుతోంది గదా !

జ : అనాదినుంచి ఈనాటిదాకా ఎవరూ ముక్తిపొందలేదు. ఇక భవిష్యత్తులోనైనా పొందుతారని నమ్మటానికి వీలులేకుండా ప్రపంచం కూడా ఉంది. ఇప్పట్లాగే ఎల్లప్పుడూ ఉంటుంది.

ప్రకృతి పురుషులు రెండింటికీ వ్యావృత్తి ఉన్నది. ప్రకృతితో పురుషునకుగల సాక్షాత్తు సంబంధం వల్లనే సాక్షిత్వం కలుగుతుంది. పరమపురుషుడే జగత్సాక్షి. భోగాలయందు అనాసక్తుడై కేవల సాక్షివలె దృశ్యాన్ని చూసి తప్పించుకునే స్వభావం కలిగిఉండేవాడు పురుషోత్తముడే. అట్టి జీవుడికి నిత్యముక్తత్వమే సిద్ధించినట్లవుతుంది.

ప్ర : ఈశ్వరునికి నిత్యముక్తత్వం ఎక్కడిది ?

జ : ఔదాసీన్యతవల్ల లభిస్తుంది

ప్ర : అంత ఉదాసీనంగా ఉండేవాడికి జగత్కర్తృత్వం ఎలా వస్తుంది ?

జ : చైతన్యప్రేరణవల్ల ప్రకృతి ఉద్దీపితమై ప్రవర్తిస్తుంది చైతన్యమే ఈశ్వరుడు గనుక ఈశ్వరునికి కర్తృత్వమే కలుగుతోంది. ఈశ్వరసన్నిధానంవల్ల ప్రకృతిలో కలిగే వికారానికే ఉపరాగ మనిపేరు. చైతన్య సంతమయిన ప్రకృతికిగూడా కర్తృత్వం ఏర్పడుతోంది.

# 2

# సృష్టి ప్రక్రియం

ప్ర : ఈసృష్టిలో ప్రకృతికి ఏవిధమయిన ప్రాధాన్యతా లేదనుకోవచ్చా ?

జ : విముక్తులయిన పురుషుని మోక్షావలోకనం కోసమో, తన కోసమో గాని ప్రకృతికీ ప్రాధాన్యత ఉంది. మోక్షావలోకనం అనగా వివేకదృష్టి. విముక్తు డయిన పురుషుడు ఆ భగవంతుడే. శాస్త్రజ్ఞులు, వేదాంతుడు, బ్రహ్మజిజ్ఞాసువులు విముక్తులయిన పురుషులే. వారికిస్నీ వివేకంద్వారా మోక్షం కలుగుతుంది.

ఈ సంసార (material world) మందు విరక్తి (non-indulgence) ఏర్పడితేగాని మోక్షం సిద్ధించదు. విరక్తుడయినవాడికే వివేకం కలుగుతుంది.

రక్తునికికాదు. ప్రకృతికి మనోరంజక గుణమున్నది. దానికే 'రాగ' మనిపేరు. పరమేశ్వరుడు ( Supreme soul ) విరాగి. రాగరాహిత్యం ( objectivity ) కలిగిఉంటాడు. ప్రకృతి పరమేశ్వరుల సంబంధం సనాతనమైనది.

ప్రకృతియందు రాగమే సంసారులకు అవివేక కారణమవుతున్నది. వైరాగ్యమే జ్ఞానానికి, తద్వారా మోక్షానికి దోహదమవుతున్నది. నిర్వికార దృష్టికే మోక్షమనిపేరు.

ప్ర : సృష్టిస్వరూపం ఏమిటో చెప్పండి!

జ : ప్రకృతినుండి మహత్తత్వం. దానినుండి అహంకారం, పంచభూతాలు: వాటిపంచ తన్మాత్రలు; వాటినుండి అయిదు కర్మేంద్రియాలు: వాటినుండి అయిదు జ్ఞానేంద్రియాలు పుట్టటమే సృష్టి.

ప్ర : పంచభూతాలకూ శరీరానికీ సంబంధమేమిటి ?

జ : శరీరంలో అగ్ని, వాయువూ, నీరు, ఆకాశము (ఈథర్), మట్టీ ఉన్నాయికదా। ఆకాశంలేని వస్తువేదీ కాదు.

ప్ర : ప్రకృతికంటే మహదాదుల గొప్పేమిటి?

జ : సృష్టి తనకోసమే జరుగుచున్నది. దానికి మరో ప్రయోజనం లేదు. సృష్టికున్న మహత్యం తన కోసంకాదు. అది ఇతరులకు ఆనందం కోసమే.

ప్ర : దిక్కులు, కాలం వంటి వాటిని కూడా చేర్చాలి గదా?

జ : అఖ్లేదు. దిక్కులు. కాలము అనేవి ఆకాశంలో అంతర్భాగాలేగావి, ప్రత్యేకించి చెప్పదగినవి కావు.

ప్ర : ఇంతకీ ఆమహాత్తు ఏమిటో చెప్పండి?

జ : అధ్యవసాయో బుద్ధిః. ఇదిగో ఇది ఇలాంటిదిఅని విశ్చయించి ఏది చెపుతున్నదో అదిబుద్ధి. ఆబుద్ధికే మహత్త్వంఉంది.

ధర్మం, జ్ఞానం, వైరాగ్యం-అనేవి దానికార్యాలు.

ఆ మహత్తత్వమే ఉపరాగాలయిన రజోగుణంతోగాని, తమోగుణం

తో కాని కలిస్తే అధర్మాన్నీ, అజ్ఞానాన్నీ, మోహాన్నీ, బానిసత్వాన్నీ (అనైశ్వర్యం) కలిగిస్తాయి.

ప్ర : అహంకారం తక్కువదా?

జ : అభిమానోఽహంకారః 'నేను' అనే అభిమానమే అహంకారమని చెప్పబడుతున్నది. ఈ అహంకారమే అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు తన్మాత్రల్నీ అదుపుచేస్తున్నది.

ప్ర : తన్మాత్రల గురించి వివరించండి?

జ : పంచభూతాలయిన పృథ్వి, వాయు, అపః, తేజస్సు, ఆకాశములకు సంబంధించిన అయిదుగుణాలు-శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలను తన్మాత్రలని అంటారు.

ప్ర : కర్మేంద్రియాలు గాని, జ్ఞానేంద్రియాలు గాని అహంకారం ఉన్నా లేకున్నా ఉన్నాయిగదా!

జ : అంహకార వికృతి అయిన సాత్త్వికభావం నుండి పదకొండు ఇంద్రియాలు ప్రవర్తిస్తున్నవి

వాక్కు, పాణి, పాదాలు, పాయువు, ఉపస్థ అను అయిదూ కర్మేంద్రియాలు; నేత్రం, శ్రోత్రం, త్వక్కు, జిహ్వ, నాసిక అను అయిదూ జ్ఞానేంద్రియాలు. వీటితో మనస్సును చేరిస్తే పదకొండయ్యాయి. ఈ పదకొండూ ఇంద్రియాలు. కర్మకీ, జ్ఞానానికి సాధనమయినదే ఇంద్రియమని వ్యుత్పత్తి ఇంద్రియాలు గలవాడే ఇంద్రుడు.

ప్ర : ఇంద్రియాలు పృథ్వ్యాదులలోని గంధాది విశేష

గుణాలను గ్రహిస్తాయిగదా! కనుక భౌతికాలని ఎందుకు చెప్పకూడదు ?

జ : ఇంద్రియాలు అహంకారం లేకుండా పని చెయ్యలేవు. కనుకనే అవి భౌతికాలుకావు.

ప్ర : అగ్నిం వాగప్యేతి, వాతం ప్రాణః, చక్షురాదిత్యం వంటి శ్రుతిలో వాక్కు అగ్నిలోను, వాయువు ప్రాణం (ఉచ్ఛ్వాస నిశ్వాసాల)లోను. కన్ను సూర్యునిలోను లీనమవుతున్నట్లు ఉందిగదా ? కనుక భౌతికమే.

జ : జ్ఞానేంద్రియాలుగల శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది పంచతన్మాత్రలతో పంచభూతములు పరామర్శింపబడుతున్నవి. శబ్దాదిదివ్య గుణాలు పంచభూతాలందు లీనమవుతున్నాయి. కనుకనే దృశ్యం గోచరిస్తున్నది జీవుడు ద్రష్ట అవుతున్నాడు. జీవునికి ద్రష్టృత్వాన్ని కలిగించగలిగింది పంచేద్రియాత్మకమయిన అహంకారమే కనుక ఇంద్రియాలు అహంకారికాలే గాని భౌతికాలుకావు.

సూర్యుడు వేరు: కన్ను వేరూ గనుకనే కన్ను సూర్యుని చూడగలుగుతున్నది. సూర్యుడు తేజస్వంతుడు. తేజోగుణంగల కన్ను సూర్యుని వలె మండదు; ఉష్ణాన్ని కలిగించదు. కనుక ఇంద్రియాలు భౌతికాలుకావు.

ప్ర : ఇంద్రియాలు శాశ్వతమేనా ?

జ : ఇంద్రియాలు ఎలా పుట్టాయో, ఏ అంశలతో పుట్టాయో ఇంతకు ముందే చెప్పకున్నాం. ఏవి పుడుతున్నాయో అవి నశిస్తాయని ఎప్పుడూ చెప్పుతూనే ఉన్నాం.

ప్ర : ఏ అహంకార పరిభావము లేకుండా ఈ ఇంద్రియాలు వాటంతటవి పనిచేయలేవా ?

జ : ఇంద్రియం కానిదేదో ఇంద్రియమను భ్రాంతిని కల్పించి అధిష్ఠించి ఉన్నది.

ప్రతి ఇంద్రియ నాడీమండలమూ గోళకమూ (neurones) లతో పనిచేస్తున్నది. జ్ఞానేంద్రియాలలో పని చేస్తున్నవి ఈ గోలక సమూహమే గాని ఇంద్రియంకాదు. ఈ గోలకసమూహానికే అతీంద్రియమని పేరు.

ప్ర : మీరు ఇంద్రియాలు ఇంద్రియాలేకాదు; గోలకాల సమూహాలే అంటున్నారు. వాటికి అతీంద్రియాలని పేరు చెప్పారు. కనుక సమస్త ఇంద్రియాలలోనూ పనిచేస్తున్నది ఒకే అతీంద్రియమని ఎందుకు చెప్పకూడదు ?

జ : అన్ని ఇంద్రియాల శక్తులూ ఒక్కలాలేవు; భిన్న భిన్నంగా ఉన్నాయి. ఒకే ఇంద్రియమో, అతీంద్రియమో ఈ జ్ఞానేంద్రియాలవెనుక పనిచేస్తున్నదనుకుంటే అన్ని ఇంద్రియాలూ ఒకే శక్తితో పనిచేయాలి. అలాపనిచేయటంలేదు కనుకనే ఇంద్రియాలన్నీ ఒక్కటికావు.

ప్ర : శక్తి భేదాన్నిబట్టి ఇంద్రియాలు వేర్వేరని చెప్పటం కల్పనకాదా ?

జ : ప్రమాణాలద్వారా తెలియజేయబడిన భేదానికి కల్పనాదోషం తగలదు.

చూచేశక్తి గల కన్ను శబ్దాన్ని వినలేదు; శబ్దాన్ని వినేశక్తిగల చెవి

వ్యక్తిని చూడలేదు. రుచి చూచేశక్తిగల నాలుక కనలేదు, వినలేదు ఇవే శక్తిభేదానికి ప్రమాణాలు.

ప్ర : అలాంటప్పుడు వస్తువుయొక్క సమగ్ర రూపం ఎలా లభిస్తుంది ?

జ : ఉభయాత్మకం మనః. మనస్సు ఇంద్రియాలద్వారా విషయాన్ని సమగ్రంగా గ్రహిస్తుంది దాని పూర్వాపరాలను పరామర్శిస్తుంది.

ప్ర : ఇంత నానాత్వం అహంకారానికి మాత్రం ఎలా వచ్చింది ?

జ : మనస్సును ఆయా యింద్రియ వ్యాపారమందు విమగ్నం చేయటంద్వారా అహంకారం నానాత్వాన్ని పొందింది. దీనికే గుణపరిణామమని పేరు.

రూప, రస, గంధ, స్పర్శ, శబ్దాలను గ్రహించటం జ్ఞానేంద్రియాల పని అయితే మాట్లాడటం, తడుముకోవటం, మలవిసర్జన, రతి చేయుట కర్మేంద్రియాల పని అవుతున్నది.

ప్ర : ఇంద్రియాలు, అవిచేసే పనులు మనకు ప్రత్యక్షంగా కనిపిస్తూనే ఉన్నాయి. అవి చేసే పనులకు అవే కర్తలనుకోవటం మంచిది కదా !

జ : చూచేవాడు, మాట్లాడేవాడూ వాటిలోపల ఉంటేనే అవి చూస్తాయి; మాట్లాడతాయి. ఆ జీవుడు ఎగిరిపోగానే అవి చూడవు; మాట్లాడవు కనుక అవి కర్తలు కావు.

ప్ర : అంతఃకరణ త్రియానికి ఉన్న లక్షణా లేమిటి ?

జ : అధ్యవసాయం (determination) బుద్ధి; లక్షణం: అభిమానం అహంకారలక్షణం; సంకల్పమే మనస్సుకు లక్షణం. ఇవి వాటి వాటి అసాధారణ వృత్తులు ( natures ).

ప్ర : అయితే సాధారణ వృత్తు లేవి ?

జ : ప్రాణం, అపానం, సమానం, ఉదానం, వ్యానం అని అయిదు రకాల గాలి ఉన్నది. అది సాధారణ వృత్తి. ఇది అయిదు జ్ఞానేంద్రియాలకు, అయిదు కర్మేంద్రియాలకు సాధారణమైన వృత్తి. పైన చెప్పిన అయిదూ పంచ ప్రాణాలని వ్యవహరింపబడుతున్నాయి.

సంకల్పం. దర్శనం, నిశ్చయం మున్నగు వృత్తులన్నీ ఒకప్పుడు వరుసక్రమంలోనూ, ఇంకొకప్పుడు అవక్రమంలోనూ జరుగుతూంటాయి.

ముఖ్యంగా బుద్ధి వృత్తులు అయిదురకాలు. ప్రమాణం, విపర్యయం, వికల్పం. నిద్ర, స్మృతి అని. యదార్థజ్ఞానం ప్రమాణం; దానికి విరుద్ధమయినది విపర్యయం; సందిగ్ధావస్థ వికల్పం; ఆలోచించలేని స్థితి నిద్ర; జ్ఞాపకం స్మృతి. ఈ వృత్తుల్లో కొన్ని క్లిష్టమయినవి (complicated), కొన్ని క్లిష్టం కానివి (simple) ఉన్నాయి.

ఏ వృత్తి లేనిస్థితిలో జీవుడు ఉపశాంతితో ఉపరాగుడై, స్వస్థః క్షేమంగా ఉంటాడు; సుఖంగా ఉంటాడు.

ఏ ప్రతిబింబమూలేని అద్దంలాగ నిర్మలంగా ఉంటాడు. వృత్తిలోకి ప్రవేశించినప్పుడే మనిషికి అస్వస్థత ప్రవేశిస్తుంది.

ఏదో అదృష్టకారణంవల్లనే బుద్ధిప్రవృత్తి పురుషార్థాన్ని ఆశిస్తున్నది. పురుషార్థ మనగా జీవునికి లాభం.

ప్ర : అలా ఎందుకు కలుగుతోంది ?

జ : దూడను చూచేసరికి ఆవులు పాలు ఎందుకు చేపుతున్నాయి ? పాలిచ్చే ప్రయోజనంకోసమే గదా ! అలాగే బుద్ధికూడా పురుషార్థాన్ని ఆశించి ప్రవృత్తిలో పడుచున్నది.

ప్ర : మీరు బుద్ధికరణాన్ని చెప్పారు. కరణాలు ఎన్ని?

జ : కరణాలు అవాంతర భేదాన్నిబట్టి పదమూడు రకాలుగా ఉన్నాయి. అయిదు జ్ఞానేంద్రియాలు: అయిదు కర్మేంద్రియాలు మనస్సు, అహంకారము, బుద్ధి అనే మూడు అంతఃకరణాలు-మొత్తం పదమూడు కదా !

ప్ర : కరణమ్ అంటే ఏమిటి? ఇంద్రియాలకు కరణత్వం ఎలా సిద్ధించింది ?

జ : వ్యాపారవత్ అసాధారణ కారణమ్ కరణమ్- అని వ్యుత్పత్తి. వ్యాపారయుక్తమయిన అసాధారణ కారణమే కరణమని చెప్పబడుచున్నది.

ఇంద్రియేషు సాధక తమత్వ గుణయోగాత్ కుఠారవత్- గొడ్డలి పగలగొట్టినట్లే ఇంద్రియాలుకూడా విషయాన్ని బద్దలుకొట్టి జ్ఞానాన్ని సాధిస్తాయిగనుక వాటికి కరణత్వం సిద్ధించింది.

లోకంలో ఒకసంగతి చూస్తున్నాం: సేవకులందరిలోనూ ఒకడు ప్రధానిఉంటాడు. వాడే అందరికీ పనులు పురమాయిస్తాడు. ఆదేవిధంగా

అయిదు జ్ఞానేంద్రియాలకూ, అయిదు కర్మేంద్రియాలకూ సమాను పురమా యించేవాడే మనస్సు. కనుక వాటన్నిటికన్నా మనస్సే ప్రధానం.

ఏ యింద్రియంలో జ్ఞానంకలిగినా మనస్సు పురమాయిస్తేగాని జర గదు. అందుకే మనస్సు ప్రధానమవుతున్నది.

అలాగే సమస్త సంస్కారాలకూ మనస్సే ఆధారమని చెప్పక తప్పదు.

స్మృతిద్వారా, అనుమానంద్వారా మనస్సు పనిచేస్తుంది ఎప్పటెప్పటి అనుభవాన్నో మనస్సే స్మరించగలదుగాని ఏ యితరయింద్రియమూ చేయ లేదు. పొగనుచూసి నిప్పు ఉనికిని అనుమానించే స్వభావం మనస్సుకేవుంది.

ప్ర: అయితే మనస్సుకూడా 'కరణ'మే గనుక దానిని కూడా ఇంద్రియమని ఎందుకనుకోకూడదు?

జ: మనస్సు కన్నా మున్నగు ఇంద్రియాలద్వారా పనిచేయగలదే గాని, స్వతహాగాచెయ్యలేదు. కనుక అది ఇంద్రియంకాదు.

ప్ర: మనస్సు ప్రధానమని ఎందుకన్నారు? ఇంద్రి యాలు పనిచేయకపోతే మనస్సుస్వయంగా పనిచెయ్యలేదుగదా?

జ: ఏ ఇంద్రియం ఆఇంద్రియం చేయగల పనినేచేస్తుంది. మనస్సు అన్ని ఇంద్రియాలచేతను పనిచేయించగలుగుతుంది. గుణాన్నిబట్టి ఏ వస్తువు యొక్క ప్రాధాన్యత అయినా నిర్ణయింపబడుతుంది

ప్ర: వీటికి పురుషార్థం ఎందుకు?

జ: తమ కర్మలవల్ల ఏ దయితే సంపాదింపబడుతుందో తదర్థం దాని కొఱకే కరణాలన్నీ ప్రవర్తించటం లోకంలో చూస్తున్నాం

ఈ మనస్సు మున్నగు పదకొండుకరణాలూ పురుషార్థసాధనలో సమంగా ప్రవర్తిస్తున్నప్పటికీ బుద్ధికే విశేషప్రాధాన్యత ఈ లోకంలో కని పిస్తున్నది.

3

# మహాభూతోత్పత్తి

ఏ విశేషములేని వాటినుంచి, విశేషాలు ఆరంభం కావటమే మహా విశేషం

ఈ స్థూల శరీరం ఆ పంచ మహాభూతాలతోనూ ఏర్పడింది. అనిప్పు అనీరు, ఆగాలి, ఆమట్టి, ఆఆకాశమూ ఈ శరీరంలో కూడా ఉన్నాయి.

ఈ శరీరంలో యిమిడివున్న బీజాలే ( Seeds ) వెలువడి మరికొన్ని దేహాలుగా విస్తరించటం(సంస్కృతి)జరుగుచున్నది. బీజప్రాయంగా ఉన్న జీవుడు పంచతన్మాత్రలను కలిగి. అతిసూక్ష్మశరీరం (ఏకకణదశ) నుండి విస్తరించి మహాకాయుడవు తున్నాడు. ఈ విధంగా ఒక్కొక్క బీజం ఒక్కొక్కకాయమై లోకంలో విస్తరిస్తున్నవి.

ప్ర : ఇలా ఎంతవరకూజరుగుతుంది?

జ : కాలాంతంవరకూ జరుగుతుంది. ఇందులో విశేషంలేదు. సృష్టియొక్క అవివేక ప్రవర్తనయేయింత.

ప్ర : ఈ సమస్త ప్రకృతియందూ మనుష్యుడుకూ ఒక భాగమై ఉన్నాడు. ప్రకృతి చిరంతనంగా తన విధులను నిర్వర్తించుకుపోతున్నది. మానవులు కూడా ఆహార నిద్రా భయమైధునాలయందే ఆసక్తి కలిగి వుండటంప్రకృతిధర్మం. ఇందులో అవివేకం ఏముంది ? అతనికి ప్రకృతివల్ల సుఖం కలుగుతున్నది గదా !

బ్రతికినంతకాలమూ అవివేకంతో బ్రతికి పుట్టేటప్పుడో చచ్చేటప్పుడో నరకయాతనను అనుభవిస్తున్నాడా-అనుకుంటే అదీ కనబడదు. పుట్టేటప్పుడు గాని, చచ్చేటప్పుడు, అతనికి స్పృహాయే ఉండదు. కనుక సుఖదుఃఖజ్ఞానం ఉండదు. అలా ఉండటంవల్లనే పరిముక్తుడవుతున్నాడు.

జ : మీరు చెప్పిన స్థూలశరీరం తల్లిదండ్రుల నుంచే కలుగుతుంది. మానవుని జ్ఞానశరీరమే తేజశ్శరీరం. అది వివేకంవల్ల కలుగుతుంది. చచ్చిన వాడి శవంలో ఏవిధమయిన సుఖదుఃఖానుభవమూ కలగదు. కనుక శరీరానికి ముందు ఉత్పత్తి అయి, శరీరంలో లీనమై సుఖదుఃఖానుభవం ఏది పొందుతున్నదో దానికే ఆ భోగంగాని, ఈ శవానికికాదు.

ప్ర : అయితే అది ఎలా ఉంటుంది ?

జ : పదిహేడింటితో కూడిన దొక్కటే అది దానికే "లింగ"మని పేరు. ఆయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, మనస్సు, అయిదు తన్మాత్రలు, అహంకారం - వీటితో కూడిన మెదడు ఒక్కటే. జ్ఞాన సాధనకు తగ్గ శరీరం. అందులోనే బుద్ధిపుడుతున్నది.

ప్ర : అయితే ఈ బుద్ధి అందరికీ ఒకేలాఎందుకు లేదు?

జ : ఆరకం వ్యక్తిభేదం జ్ఞానసాధనకు వారుచేసిన కృషి (కర్మ) పై ఆధారపడివుంది.

ప్ర : బుద్ధికే భోగానుభవం ఉండేటట్లయితే శరీరం ఎందుకు సుఖపడుతోంది ?

జ : కర్మఫలం పొందేది బుద్ధికే కర్మలకు యజమాని బుద్ధియే.

మనం చేసిన కర్మలవల్ల లభించే సుఖానుభవం గాని, దుఃఖానుభవం గాని బుద్ధియే పొందుతోంది. శరీరం ద్వారా బుద్ధిపొందుచున్నది గనుక శరీరం కూడా పొందుచున్నట్లు భ్రమ కలుగుతోంది.

ప్ర : బుద్ధివల్లనే భోగం సిద్ధిస్తున్నప్పుడు ఆ స్థూల శరీరంగాని, ఈ సూక్ష్మశరీరంగాని ఎందుకు ? కేవలం బుద్ధి ఉంటే చాలదా ?

జ : బుద్ధి అనేది నిశ్శరీరశక్తి. దానికాశ్రయము మెదడు. అదే దాని సూక్ష్మశరీరం. ఈ సూక్ష్మశరీరం కూడా స్వతంత్రంలేనిదే. కనుక దానికి ఆశ్రయంగా స్థూలశరీరం ఉండాలి. నీడగాని, బొమ్మగాని ఏ ఆధారం లేకుండా ఏర్పడవు. అలాగే ఇదికూడా. బుద్ధికి మెదడు, మెదడుకు శరీరమూ ఆధారాలు.

ప్ర: బుద్ధీ, దానికి సూక్ష్మశరీరమయిన మెదడు ఉన్నాయిగదా ! వాటితోటే అన్నిపనులూ చేసుకోవచ్చుగదా ! దానికింత స్థూల శరీరమెందుకు ?

జ : సూర్యుడు నెత్తిమీద ఉన్నాడు. సూర్యకాంతివల్లనే సముద్రాలు ఆవిరై వర్షించి పంటలు పండుతున్నాయి. వృక్షాలు వెదజల్లిన విత్తనాలు నాటుకునేందుకు నీరుపోస్తున్నది సూర్యుడే. ఆ మొలకెత్తిన మొక్కలు ఆ సూర్యకాంతి సహాయంతోనే ఆకులందు ఆహారాన్ని పచనం చేసుకొంటున్నాయి. పుష్పిస్తున్నాయి, ఫలిస్తున్నాయి. సూర్యోదయంకోసం పద్మాలు విరహపడుతున్నాయి. సూర్యకాంత పుష్పాలు తలలు తిప్పి చూస్తాయి. అయితే సూర్యుడు స్వయంగా ఈ పనులన్నీ చేయిస్తున్నాడా ? లేదు. సూర్యాతాపం ఉంటేనే సముద్రాలు తమకు తాము ఆవిరై,

మేఘమై వర్షిస్తున్నాయి. ఆ వర్షించేవి సముద్రాలే గాని సూర్యుడు కాదు. సూర్యకాంతి ఉన్నప్పుడే చెట్లు ఆహారాన్ని పచనం చేసుకోగలుగుతున్నాయి. అది చెట్లు చేసుకునే పనేగాని సూర్యుడు చేసే పనిగాదు.

సూర్యునిలాగే బుద్ధి కూడా క్రియాత్మకమైన పనులు చెయ్యదు. ఏదో ప్రేరేపింపబడి తన పనులు తానుచేసుకొంటుంది.

ప్ర : అలా అయితే అదేం చేస్తుంది ?

జ : అది చేసేది అణువంతపని అని శ్రుతి. అది కూడా మనం తినేఅన్నం మీద ఆధారపడి ఉంటుంది;

ప్ర : ఇతో అంతో మెదడు వుంది కదా! అదికూడా పనిచేస్తున్నట్లు కనబడదు. ఇంతకీ అది పనిచేస్తుందా లేదా ?

జ : దానిపని వంటింట్లో వంటలా కనబడకుండా జరిగిపోతుంది. అణువులో జరిగే చలనం కనిపిస్తున్నదా? పైకి ఏపనీలేని అణువే కనిపిస్తుంది.

ప్ర : మరి పాంచభౌతిక శరీరమో ?

జ : పృధ్వి, వాయువు, తేజస్సు, నీరు, ఆకాశాల కలయికనుంచే పాంచభౌతికమయిన శరీరం ఏర్పడింది అయినా కొందరు ఆకాశం కాదు. పృధ్వి, జలము, వాయువు, అగ్ని అను నాలుగింటితోనూ ఏర్పడిన దంటున్నారు. కొందరు "షట్ !- ఇంకేముంది యిందులో ?"నంటున్నారు.

చివరికి అంతే కావచ్చు కాని ఉన్నంతవరకూ శరీరంలో అయిదు భూతాలున్నాయి. ఎందులో ఆకాశం (ఈథర్) ఉంటుందో అదే దహించుకుపోతుంది. దహ్యగుణం కలదు గనుకనే అది 'దేహ'మని చెప్పబడింది.

పంచభూతాలలో ఏ ఒక్కదానిలోకూడా చైతన్యం లేదు. స్వాభావిక చైతన్యం లేదు. గాలి జోరుగా వీచాలంటే ఎండ బాగా కాయాలి. అగ్ని వాయువుకు తోడ్పడింది. మంట బాగా మండాలంటే గాలి తోడ్పడాలి. సముద్రం ఉప్పొంగాలంటే ఎండ బాగా కాచి, వాయువు ఉరకలెత్తాలి. మహాసముద్రగర్భాలలో సైతం అగ్నిపర్వతాలు కాలుతూనే ఉంటాయి. ఇదంతా స్వాభావిక చైతన్యంవల్లకాదు. ఒకదాని కొకటి తోడ్పడటంవల్ల

చైతన్యం దేహానిదే అయితే మరణం కలగనే కలగదు. శరీరం దానినెప్పుడూ పోగొట్టుకోదు గనుక. ప్రపంచంలో మరణమే లేకుండా పోతుంది ఎవరికీ నిద్రకూడా అవసరం ఉండదు.

ఏఒక్క భూతమునందూ లేని మతబలం కొన్ని భూతాల సంపుటి అయినప్పుడే కలుగుతుందందామా ? కావచ్చు. వాటి కలయికవల్ల ధ్వంసం కలుగుతుంది ఉపద్రవాలు కలుగుతాయి. కాని చైతన్యం కలగదు

పంచభూతాలలో లేశమైనాలేని చైతన్యం పాంచభౌతిక శరీరం నుంచి వస్తుందా ? అసంభవం.

ప్ర: అయితే ఇక మోక్షం లేనట్లే ?

జ ; మోక్షం ఎందుకులేదు ? జ్ఞానాన్ ముక్తిః అంటున్నారు. జ్ఞానమే మోక్షం. మోక్షమనగా దుఃఖంనుండి విముక్తి. మనం లోగడ చెప్పుకున్న ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక దుఃఖాలనుంచి తప్పించు కోవటమే మోక్షం. దానికి జ్ఞానమే సాధనం. ఈ మూడురకాల దుఃఖాల లోనూ మునిగిపోవటమే బంధం.

ప్ర: కర్మలుచేస్తే మోక్షం వచ్చేస్తుందికదా అని పూజలు, ప్రార్థనలు చేస్తున్నారు గదా ! వాళ్ళకి జ్ఞానంలేదా?

జ : ఆసంగతి నాకుతెలియదు. ముక్తికి జ్ఞానం ఒక్కటే నియత (Fixed) కారణమని నాకుతెలుసు ఈ జ్ఞానం మరోదానితో కలిస్తే మోక్షం వస్తుందా, లేదా అన్న ప్రశ్నేకాదు. కర్మలతో కూడిన జ్ఞానంవల్ల గాని, ఒకప్పుడు జ్ఞానంవల్ల మరొకప్పుడు కర్మవల్ల మోక్షం వస్తుందనిగాని లేదు.

జ్ఞానం, కర్మ రెండూ వున్నచోట మోక్షం వస్తుందని కూడాలేదు.

ఊహలో ఉండే పదార్థాలున్నాయి. స్వప్నంలో వచ్చే పదార్థాలూ ఉన్నాయి. ఈ రెండింటినిగాని, వీటిలో ఏ ఒక్కటినైనాగాని తింటే ఆకలి తీరుతుందా ? తీరదు. తీరాలంటే నిజమైన పదార్థాలనే తినాలి.

ఏ ఇతర వస్తువూ మోక్షాన్ని కలిగించలేదు.

యజ్ఞాదులకు సంకల్పం చెపుతాము. ఆవిధంగా సంకల్పింపబడిన ఏ కార్యకర్మవల్లనయినా మోక్షం వస్తుందని అనుకోవద్దు

జ్ఞానం అగ్నిలాంటిది. అది మనస్సును పరిశుద్ధం చేస్తుంది. వర్షంలో తడిసిన ప్రకృతివలె నిర్మలమైన మనస్సు ధ్యానంవల్ల జ్ఞానాన్ని పొందగలుగుతుంది.

ధ్యానం :

ప్ర : ధ్యానమంటే ఏమిటి ?

జ : రాగోపహతియే ధ్యానం. రాగ మనగా ఉద్వేగం. ఉద్వేగం (passion) లేని ప్రశాంతచిత్తస్థితితో ఉండటమే ధ్యానం.

ఈ ప్రశాంతచిత్తస్థితి లభించాలంటే చిత్త వృత్తి నిరోధం జరగాలి.

అనగా మనస్సును ఉరకలు వేయకుండా బంధించాలి. చిత్తవిభ్రమం కలగకూడదు సంధిగ్ధస్థితి పొందకూడదు. నిద్రాస్థితి పొందకూడదు. స్మృతులు (memories) బాధించ కూడదు. అంతే కాదు; అనుమాన ప్రమాణం గాని, శబ్దప్రమాణం గాని మనస్సును వేధించకూడదు.

ధారణ, ఆసనం, స్వకర్మ అను వాటివల్ల చిత్తవృత్తి నిరోధం సాధ్యమవుతుంది.

ఛర్ది, ధారణలద్వారా ఊపిరిని నిరోధించటాన్నే ధారణ (Retention) అంటాము. ప్రాణమనగా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు. వాటిని నిరోధించే ప్రక్రియకే ప్రాణాయామమని పేరు. దీనిని అభ్యసించినట్లయితే చిత్తవృత్తి నిరోధం సాధ్యమవుతుంది.

శ్వాసకోశాలలో ఉండేగాలిని పూర్తిగా బయటకు పంపటాన్నే ఛర్ది అంటారు. శ్వాసకోశాలను బయట గాలితో నింపటాన్ని 'పూరక' మంటారు. లోపలికి పూర్తిగా గాలిని పీల్చుకొన్నప్పుడు, అలాగే బయటకు పూర్తిగా విడిచి పెట్టినప్పుడు గాలిని కొంత సేపు బంధించటాన్నే 'నిరోధం' అంటారు. ఈ మొత్తం క్రియకే 'ధారణ' మని పేరు.

## ఆసనం :

స్థిరంగా, సుఖంగాకూర్చునే విధానాన్నే ఆసనమంటాము. పద్మాసనం ప్రసిద్ధమైనదే.

## స్వకర్మ :

బ్రహ్మచర్యాది ఆశ్రమాలలో తనకు ప్రస్తుతం ఏ ఆశ్రమం ఉన్నదో, దాని విధులకు అనువర్తించి ఉండటం 'స్వకర్మ' మనబడుచున్నది.

## వైరాగ్యం :

ఈ విధంగా ధారణ 'ఆసన' స్వకర్మలు చిత్తవృత్తి నిరోధానికి కారణమవుతున్నాయి. అవిగాక 'వైరాగ్యం' మరో సాధనం. లౌకికజగత్తునందు విరక్త మనస్కతను అభ్యాసంద్వారా ఎవరైనా పొందవచ్చు. ఆరకం వైఖరిగలవాళ్ళకి చిత్తవృత్తు ఉండవు.

వివేకానికి విరుద్ధమైనది అవివేకమే. దానికే విపర్యయమని పేరు. ఇది త్రిమాత్మకం. అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం అని ఇది అయిదు రకాలుగా వుంటుంది.

వీటిని గురించి యిదివరకే చెప్పుకున్నాం. పైన చెప్పిన అయిదు విపర్యయాలు ఇరవై ఎనిమిది రకాల అశక్తివల్ల కలుగుతున్నాయి

ఇక తుష్టి తొమ్మిది విధాలుగా ఉంది.

సిద్ధులు ఎనిమిదిరకాలుగా ఉన్నాయి.

వీటి అవాంతరభేదాలు అరవై రెండు కనిపిస్తున్నాయి.

అజ్ఞానమే అవిద్య: అహంకారమే అస్మిత; ఉద్రేకమే రాగం (Passion): అసహ్యించుకోవటమే ద్వేషం ఏదో ఒక లక్ష్యాన్ని సాధించాలన్న పట్టుదలయే అభినివేశం (Tenacity) ఈ అయిదూ ప్రధానం.

ఇలాగే ఇతరములయినవే కనిపిస్తున్నాయి,

## తుష్టి :-

ఆధ్యాత్మికాదిభేదాలచే తుష్టి (Satisfaction) తొమ్మిది రకాలుగా ఉంది.

సమస్త పరిణామానికి ప్రకృతిదే కారణమన్న అభిప్రాయంతో జీవించే ప్రాథమిక దశనే ప్రాకృతికతుష్టి అంటాము.

వివేకోదయం కావటంతో ఈ ప్రకృతియే మిధ్య అనెడి భావం కలిగి సంన్యాసం తీసుకోవటం జరుగుతుంది. అందులో కలిగే సంతృప్తినీ ఉపాదనతుష్టి అంటారు. అందులో చిరకాలం ఉన్నందువల్ల కలిగే తృప్తిని కాలతుష్టి అంటారు. ఇలా సంన్యాసంలో ఉండగా యోగవశాత్తూ లభించిన వివేకఖ్యాతి రూపంతో ధర్మమేఘ సమాధి పొందటం జరిగితే అది భాగ్య తుష్టి — ఈ నాలుగూ ఆధ్యాత్మిక తుష్టులు. మిగిలిన అయిదు రకాల సంతృప్తులు సాంసారికమయినవి. సంపాదించటంలోనూ, రక్షించటం లోనూ, నాశనం చేయటంలోనూ, అనుభవించటంలోనూ, హింసించటం లోనూ కూడా తృప్తి కలుగుతుంది కొందరికి. కనుక ఈ అయిదింటినే మరో అయిదు రకాల తుష్టులుగా చెప్పటం జరిగింది.

సిద్ధులు :-

సిద్ధులు ఎనిమిది రకాలని ముందే చెప్పుతున్నాం.

మొదటిది ఊహ : ఊహించకుండా ఏ కొత్త విషయమూ కను క్కోవటం జరగలేదు. శాస్త్రపద్ధతికి అనుమాన ప్రమాణం ఊహయేకదా! కావ్యత్వానికి పునాదికూడా ఊహయే (imagination). కనుక కవితాసిద్ధికీ, శాస్త్రపరిజ్ఞాన సిద్ధికీ ఊహయే మూలసిద్ధి.

రెండవది శబ్ద సిద్ధి: పురాణశ్రవణాదులవల్ల కలిగిన శ్రుతపాండిత్యం తక్కువదికాదు. అక్షర జ్ఞానంలేని వారుకూడా నానాశాస్త్ర గ్రంధాదుల శ్రవణంవల్ల పాండిత్యాన్ని పొందుతున్నారు. అదిశబ్ద సిద్ధియే.

మూడవది అధ్యయనసిద్ధి; నానాగ్రంథాలను చదివి నేర్చుకున్న విద్య

నాల్గవది సుహృత్ప్రాప్తి; సహృదయులయిన స్నేహితుల ప్రసంగం నుండి పొందిన జ్ఞానలాభమే యిది. నానాదేశాటవంగాని, బహుశ్రుతులతోడి సాంగత్యంగాని ఎలాంటివాడికయినా జ్ఞానాన్ని కలిగించ గలదు.

అయిదవది దానశుద్ధి : డబ్బిచ్చి గురువులద్వారా పొందగల విద్య.

ఆరవది : ఆధ్యాత్మిక దుఃఖాన్ని పోగొట్టగల సాధనం. మనస్సుకు, ఉత్సాహానికీ ప్రతిబంధకమయిన పరితాపాన్ని తొలగించుకునే విధానం.

ఏడవది : ఆధిభౌతిక దుఃఖహేతువుల్ని నిర్మూలించే ఔషధాదులు. ఆధిభౌతికము లనగా మానసికచింతవల్ల శరీరానికి కలిగే జ్వరాది రుగ్మతలు, వాటిని పోగొట్టగల ఔషధాలే సిద్ధులు.

ఎనిమిదవది : ఆధిదైవికదుఃఖనివారణహేతువు. ప్రమాదవశాత్తూ కలిగే బాధలనుండి పొందగల రక్షణ.

ఈ ఎనిమిది సిద్ధులవల్ల విపర్యయజ్ఞానం నశించిపోతుంది. యదార్థ జ్ఞానం లభిస్తుంది. మనస్సుకీ, శరీరానికీ శాంతీ, తుష్టి లభిస్తాయి.

అయితే ఈ సిద్ధులేవీ ఉపవాసాదులద్వారా చేసే తపస్సువల్ల లభించవు. తపస్సువల్ల శారీరిక రుగ్మతలు నశిస్తాయే గాని మానసిక భ్రమలు తొలగిపోవు కనుక అట్టి సిద్ధు లేవీ లభించవు.

## సృష్టి :

సృష్టి ద్వైవాది భేదాలను కలిగి ఉంది. బ్రహ్మనుంచి స్తంభం దాకా ఉన్న సమస్తసృష్టి నీ కొరకే వుంది. నీకు వివేకం కలిగేదాకా నువ్వు

అనుభవించటం కోసమే వుంది నువ్వెప్పుడు వివేకవంతుడ వవుతావో అప్పుడు నీకు దానితో పనిలేదు

సత్త్వగుణం ఎక్కువగా ఉండేవాటి సృష్టిని దైవీసృష్టి అని చెపుతాం. జ్యోతిష్మంతాలై ఆకాశంలో ఉండే నక్షత్రాది వస్తువులన్నీ దైవీసృష్టికే చెందుతాయి.

తమో విశాలా మూలతః- తమోగుణం ఎక్కువగా ఉండే సృష్టి గ్రహాదులు ఇది తిర్యక్ సృష్టి.

ఈ రెంటికీ మధ్యనుండేదే బ్రహ్మాండం. ఇది ప్రాణస్పందన సృష్టి కనుక మానవీయ సృష్టి

ఈ ప్రకృతి తాను పుట్టింది లగాయతు కర్మలయందు వైచిత్రిని సృష్టించటమే ప్రధానచేష్టగా కలిగి ఉన్నది. కనుక ఎన్నెన్నో చిత్రవిచిత్ర కర్మలు సృష్టింపబడుచున్నాయి.

ప్ర : పుణ్యకర్మలవల్ల పురుషునికి ఊర్ధ్వగతులు లభిస్తాయంటారు. ఇక మోక్ష మెందుకు ?

జ : ఎన్ని పుణ్యకర్మలు చేసుకొన్నా ఈ మానవీయసృష్టిని అతిక్రమించి దైవీ సృష్టిలోనికిగాని, తిర్యక్ సృష్టిలోకిగాని ఎవరూ వెళ్ళరు. కనుక ఉత్తరోత్తర యోనులందు పుట్టవలసిన విధి ఎలాగూ ఉన్నందువల్ల పునరావృత్తి (తిరిగి పుట్టటం) ఎలాగూ తప్పదు. కాబట్టి ఊర్ధ్వగతిని గురించి ఆలోచించటమే అనవసరం.

ప్ర : ఈ సృష్టికి కారణమయిన ప్రకృతి ఉండనేవుంది. దానియందే లీనమయితే మంచిది కదా !

జ : నీళ్ళల్లో మునిగినవాడు పైకి తేలితీరతాడు. ప్రకృతిలో మునిగినవాడుకూడా తిరిగి సంసార్కారంలో పడతాడు. కాబట్టి ఆ ప్రయత్నం వ్యర్థం.

ప్ర : సమస్త జగత్తునకు మూలాధారమయిన ప్రకృతి తనయందు లీనమయిన వ్యక్తిని ఎందు కలా బయటకు తోసే స్తుంది ?

జ : ప్రకృతి పరాధీనమై పరవశంలో ఉన్నది. అది మరోపురు షునకు చోటివ్వదు.

ప్ర : ప్రకృతి ఎందువల్ల పరవశంలో పడింది ? ఎవరతడు ?

జ : అతడు సర్వజ్ఞుడు; సమస్తానికీ కర్త. ఈ విధంగా ఈశ్వరుడు సిద్ధిస్తున్నాడు.

ఈ దృశేశ్వర సిద్ధిఃసిద్ధా

ఆ ఈశ్వరుని ఆధీనంలో ఉండే ప్రకృతియావత్తూచిత్రవిచిత్రాలను పురుషునికోసం సృష్టిస్తూఉన్నది. ఒంటె ఇతరుల కోసమే కుంకంబిస్తాలను మోసుకొచ్చినట్లు

ప్ర : చేతనంలేని ప్రకృతి పురుషునికోసం అన్నీ సృష్టి స్తున్నదంటే నమ్మశక్యం కాకుండా ఉంది.

జ : నిజమే. ప్రకృతికి చైతన్యంలేదు. అయినప్పటికి అప్పుడు పుట్టిన ఆవుదూడకు పాలను సృష్టిస్తున్నట్లే ప్రాణులకొరకు ఈ జగత్తును సృష్టిస్తోంది.

ప్ర : కర్మలకు కట్టుబడేకదా వసంతాది ఋతువులూ ఒకదాని వెనక ఒకటి వస్తున్నాయి ! ప్రకృతికి చైతన్యంలేని

మాట నిజమే అయినా చైతన్యం ఉన్నట్లే ఈ కాలక్రమం సూచిస్తున్నది? ఎందువల్ల?

జ: కర్తవ్య భావనవల్ల.

ప్ర: ప్రకృతికి చైతన్యంలేదుగదా! తనకిది కర్తవ్యం అని అది అనుకోదు. అయినా యింత క్రమశిక్షణ దేనికి?

జ: స్వభావా చేష్టితమ్; అనభిసంధానాత్; భృత్యవత్. నౌకరు ఏ పనినీ తనకిది కర్తవ్యం అని అనుకుంటూ చెయ్యడు. ఎప్పటి కప్పుడు అవసరాన్నిబట్టి చేస్తాడు ప్రకృతి కూడా నౌకరులాంటిదే. అలా ప్రవర్తించటం దాని స్వభావం.

ఈ సృష్టి అనాది; కర్మలు అనాది. వాటి ఆకర్షణ అనాది కర్మల యందు ఆకర్షణవల్లనే ప్రకృతి ఈ పని చేస్తున్నది.

ప్ర: అయితే ఈ సృష్టి ఎన్నికోట్ల సంవత్సరాలయినా యిలాగే సాగుతూ వుంటుందా?

జ: పాకంరాగానే పచనం అయిపోతుంది. సదవగాహన లభించ గానే సృష్టి నివృత్తి అవుతుంది

ప్ర: ఎవరికోసం ఈ సృష్టి?

జ: ఈ ప్రకృతి వివేకికోసం ప్రవర్తిల్లదు అవివేకికే యిందులో ఆనందం ఉంటుంది. అతని కోసమే ఈ ప్రకృతి తనయందు చిత్రవిచిత్రా లన్నీ సృష్టించు కుంటుంది. అంతా పురుషుణ్ణి ఆకర్షించటంకోసమే. బిడ్డను మరిపించే తల్లి మాతృత్వంలోని మాధుర్యం ప్రకృతి చిత్రాలలో ఉంది.

అవివేకి అయిన పురుషుని వినోదం కోసమే ప్రకృతి సృష్టిని సాగిస్తున్నది. ఆ దోషంవల్లనే అవివేకులు మరింత అవివేకులవుతున్నారు.

కనుక ప్రకృతియందు రాగం గలవాడు అవివేకి. విరక్తుడయిన వాడు వివేకి. ఈ యిద్దరిలోనూ రెండవ వాడికే ఔదాసీన్యంవల్ల మోక్షం లభిస్తోంది. తల్లిపాలు త్రాగుతున్నంత కాలం ఎవడైనా బాలుడే. తల్లిపాల యందు విరక్తుడై స్వయంగా ఆహారం తినేవాడు ముక్తుడు.

త్రాడునుచూసి పామనుకొని భయపడేవాడు అది త్రాడేగాని పాము కాదన్న వివేకం పొందగానే భయకంపాదుల్ని విడిచిపెట్టినట్లు వివేకి ప్రకృతి యందు మోహాన్ని విడిచిపెడతాడు. అవివేకి విరక్తి చెందడు. యింకా ఒకటే భ్రమలో ఉంటాడు.

వాడెంత సేపూ కర్మలనిమిత్తమే తానుజీవించి ఉన్నాననుకొంటాడు.

ప్ర : ఏవిధమయిన అపేక్షా లేకుండా కేవలం పరోపకారచింతనతోనే ప్రకృతి వ్యవహరించటం అవివేకమే. అదెంత సేపూ అవివేకికి అవివేకాన్ని కలిగించటమే అవుతుంది.

జ : ఇతరుల్ని ప్రకోపింపచేసే ప్రవృత్తిగల నర్తకివలె ప్రకృతి కూడా వివేకి అయిన పురుషుని వదిలివేస్తుంది. దరిద్రుడయిన పురుషుని వేశ్య విడిచిపెట్టినట్లు. భర్తకు తన దోషాలు తెలిపినందుకు సిగ్గుపడి దూరమయ్యే కులస్త్రీవలె వివేకిఅయిన పురుషునికి ప్రకృతి దూరమౌతుంది.

అవివేకం లేకుండా ప్రకృతికిగాని, పురుషునికిగాని బంధమూలేదు, మోక్షమూలేదు.

ప్ర : అప్పుడు ప్రకృతికి ప్రమేయ మేముంది ?

జ : పశువును బంధించే కన్నెత్రాడు ఉన్నదిగదా! అజ్ఞానానికి ప్రకృతితో గల సంబంధమే పశువునుకట్టే త్రాడులాంటిది. అంతవఱకూ ప్రకృతికి ప్రమేయం ఉంది.

ధర్మార్థకామాలతో సంగం ఉన్నంతవరకూ పురుషుడు బంధమోక్షాలనుపొందుతూనే వుంటాడు ఇదే కన్నెత్రాడు వంటిది. పశువును బంధిస్తూవుంటుంది.

ప్ర : అది పురుషుని సంగతి. అవివేకి అయిన ప్రకృతికి కూడా బంధమోక్షాలున్నాయా ? ఉంటే వాటికి దోహదం చేసే గుణాలేమిటి ?

జ : ప్రకృతి తనగూటిని తానే కట్టుకుని అందులో బంధింపబడే గొంగళిపురుగులాంటిది దానిని బంధించేందుకు ఏడు గుణాలున్నాయి. ధర్మం, వైరాగ్యం, ఐశ్వర్యం, అధర్మం, అజ్ఞానం, అనురక్తి, పరాధీనత అనే ఏడూ దానిని బంధిస్తాయి. వివేకం అనే గుణమొక్కటే దానిని ఆ బంధంనుంచి విడిపిస్తుంది.

ప్ర : అవివేకం గుణమా ? ఉపాదాన కారణమా ?

జ : అవివేకం గుణమే. పురుషుని బంధత్వానికి అవివేకంనిమిత్తమే కనుక దానిని గుణంగా చూడకతప్పదు.

ప్ర : అవివేకం గుణమయితే వదలదుకదా ! అది వదిలితేగాని వివేకం ఎలా కలుగుతుంది ?

జ : ఆలోచన ప్రారంభం కావాలి. బహుముఖాల ఆలోచించటం నేర్వాలి. తర్కబుద్ధిని ప్రయోగించాలి. నేతి నేతీతి త్యాగాత్. ఇదికాదు,

ఇదికాదు అని విడిచిపెడుతూ తత్త్వాన్ని అభ్యసించి నట్లయితే వివేకం సిద్ధిస్తుంది.

ప్ర: వస్తు తత్వాన్ని తెలియటానికి నేతినేతి సిద్ధాంతాన్ని (negation of negations) అనుసరిస్తే చాలంటున్నారు. ఈ తత్త్వాభ్యాసం వల్ల అందరికీ వివేకం ఒక్కలాగే కలుగుతుందా ?

జ : వారివారి బుద్ధినైశిత్యాన్ని బట్టి అంతరాలు ఉంటాయి. మంద, మధ్యమ, ఉత్తమ తరగతులు ఏర్పడతాయి.

ప్ర: వివేకం కలగటంతోటే అవివేకం కూడాపోతుంది గదా! దానితో సుఖదుఃఖానుభూతి పూర్తిగా నశించి పోతుందా ?

జ ; మధ్యమ వివేకం ఉన్నవానికి సుఖదుఃఖోపభోగం ఉంటుంది.

ప్ర: ఎంతోకొంత వివేకం కలిగినాసరే, దుఃఖం తప్పనప్పుడు వివేకంవల్ల ప్రయోజనమేమిటి ?

జ : జీవన్ముక్తత్వం. జీవించి ఉండగానే ముక్తిని పొందటం. ఈ దుఃఖానుభవం పునరావృత్త మవుతున్నప్పటికీ, వాటిని తృణీకరించి మసలడం- అదే జీవన్ముక్తి- అది కలుగుతుంది.

ఈ జీవన్ముక్తి ఉపదేశకునివల్ల ఉపదేశింప బడేవాడికి సిద్ధిస్తుంది. అందుకు వేదమే ప్రమాణం.

జ్ఞానోపదేశకులు ఈ లోకంలో లేనిపక్షంతో అంధుల పరంపర ఏర్పడి ఉండేది. జ్ఞానులే కరువై ఉండేవారు,

ప్ర: వివేకవంతుణ్ణి ప్రకృతి విడిచి పెడుతుందిగదా?

జ: కుమ్మరి కర్రతో కొంతసేపు చక్రాన్ని గిరగిరా త్రిప్పి విడిచి పెడతాడు. అయినా ఆ కుమ్మరిసారె ఆగిపోకుండా తిరుగుతూనే ఉంటుంది. కనుక ప్రకృతి విడిచిపెట్టిన తర్వాతకూడా శరీరం చెక్కుచెదర కుండానే ఉంటుంది.

ఈ శరీరం నిలవటానికి ఏ సంస్కారాలు అవసరమవుతున్నాయో అవి అంతోకొంతో ఉన్నంతవరకూ శరీరం బాగానే ఉంటుంది. అంతవరకు ఇతను జీవన్ముక్తుడిగానే ఉండగలడు.

వివేకంవల్ల సమస్త దుఃఖాలు తొలగిపోగా కృతకృత్యుడవుతాడు. ఏ యితరమైన దానివల్లను కృతకృత్యుడు కాలేడు.

# 4

# వివేకం

తత్త్వోపదేశంవల్ల వివేకం కలుగుతుంది. గురువు వలన శిష్యునికి వివేకం లభిస్తుంది.

గురువు శిష్యునికి చెపుతున్నప్పుడు దూరంనుంచి విన్నా వివేకం లభిస్తుంది.

ఒక్కసారి వివేక ప్రసంగం జరిగినంతమాత్రాన చాలదు. పదే పదే ఆ ప్రసంగం జరుగుతూ వుండాలి. ఇది ఆవృత్తి.

తండ్రి కొడుక్కి, గురువు శిష్యులకీ పదే పదే వివేకవచనాలు చెప్పటం అవసరం.

వివేకోదయం కాగానే విషయ సుఖాలయందు ఆసక్తిని వివేకి స్వయంగా విడిచిపెడతాడు. ఆలా విడిచిపెట్టటంలోనే సుఖం వుంది. ఇతరుల బలవంతం మీద విడిచిపెడితేనే దుఃఖం కలుగుతుంది. కనుక త్యాగమే వివేకాన్ని స్థిరపరుస్తున్నది.

పాము కుబుసాన్ని విడిచినట్లు వివేకి విషయసుఖాలను విడిచి పెట్టాలి ఏ కారణంవల్లనయినా చెయ్యి కుళ్ళిపోతే ఆ కుళ్ళిన చేతిని నరికించి సుఖపడినట్లే విషయ సుఖాలను విడిచిపెట్టాలి

భరతుడొక లేడిపిల్లను పెంచి, దానికోసం తాపత్రియం పడతాడు ఆది బంధహేతువు వివేకసాధనాలు కానివాటి గురించి ఆలోచించకు. అవి బంధహేతువు లవుతాయి.

భిన్నస్వభావుల సంగమం రాగద్వేషాలకు కారణం విరోధం కలుగుతుంది. గజ్జెల్లోని మువ్వలు ఒకదానితో ఒకటి ఢీకొన్నప్పుడె గదా ధ్వని.

ఇద్దరికయినా స్నేహం మంచిదికాదు. అది కూడా బంధహేతువే.

నీ యిల్లు నీకు లేకున్నా దుఃఖపడనక్కర్లేదు. పరాయి కొంపల్లో నివసించే పాము సుఖపడటం లేదా?

వివేకవంతులయిన గురువుల నాశ్రయించు: తుమ్మెద పువ్వుల్లోని సారాన్ని గ్రహించునట్లు సమస్త శాస్త్రసారాన్ని గ్రహించు

బాణాన్ని ఎక్కుపెట్టి లక్ష్యాన్ని కొట్టాలని చూసేవాడికి అది తప్ప ఇటూ అటూ ఏదీ కనబడదు. అట్లే ఏకాగ్రచిత్తం గలవాడికి సంసార విషయాలు పట్టవు

శాస్త్రనియమాలను ఉల్లంఘించి చిత్తశాంతిని పొందాలని ప్రయత్నించవద్దు పథ్యపానాలను విడిచి రోగాన్ని పోగొట్టుకోలేవు.

శాస్త్రనియమాలను విమర్శించటం జరిగితే శాస్త్రమే మనల్ని విస్మరిస్తుంది. వివేకం విడాకులిస్తుంది. అజ్ఞానం ఆవరిస్తుంది;

గురుముఖతా ఎంతటి వివేక వచనాలువిన్నా. వాటిని బాగా పరామర్శించాలి అనగా ఒంటరిగా ఆ వాక్యాల గురించి విపులంగా ఆలోచించాలి. లేకుంటే అవి ఒంటబట్టవు

పూర్వం ప్రజాపతివిచేరి ఇంద్రుడు, విరోచనుడు అనువారు ఉపదేశాన్ని పొందారు. అందులో ఇంద్రుడొక్కడే బాగా పరామర్శించి కృతార్థుడయ్యాడు. విరోచనుడు విఫలుడయ్యాడు

శ్రవణానంతరం పరామర్శ చేసినంత మాత్రాన వివేకంకల్గుతుందా?

వినమ్రభావానికి పరిణతి అనిపేరు. ఇంద్రియాలన్నిటినీ నిగ్రహణం చేసి, బుద్ధిని ఉగ్రించేయటం బ్రహ్మచర్యం. శ్రద్ధ, భక్తులతో గురువును

అర్చించటం ఉపసర్పణం. ఇవన్నీ నియమపూర్వకంగా ఆచరిస్తూ చిరకాలం శ్రవణపరామర్శలద్వారా వివేకాన్ని పొందినవాడు ఇంద్రుడు. ఇంద్రియాలను జయించినవాడే ఇంద్రుడవుతాడు.

వామదేవునివంటివారికి పూర్వజన్మసంస్కారంవల్ల వివేకం తొందరగా లభిస్తుంది. కనుక వివేకోదయానికి కాలనియమం లేదు.

యజ్ఞఫలం తక్షణం లభించదు. అలాగే నమ్రభావం అలవడటానికి కొంతకాలం పడుతుంది. బ్రహ్మచర్యం పాటించటానికి కొంత కష్టమవుతుంది. అలాగే తత్త్వోపదేశసమయంలో శ్రద్ధాసక్తుల్ని నియమించుకోవటం కష్టమవుతుంది. ఆ తర్వాత విన్నవిషయాలను ధ్యానించటం అలవాటు కావడానికి సమయం పడుతుంది. ఆ ధ్యానం పక్వమయితేగాని సమాధి లభించదు. సమాధి లభించాకనే చిత్సాక్షాత్కారం లభిస్తుంది. ఆఖర్ని వివేకం కలుగుతుంది ఈ పరంపర కష్టసాధ్యమయినది. కాలాంతరాన్ని గాని లభించదు.

అలాంటప్పుడు వివేకోపాయాన్ని విడిచిపెట్టి యజ్ఞయాగాది క్రతువుల్ని చేయడం ద్వారా మోక్షాన్ని సంపాదించుకోలేమా?

దానివల్ల మళ్ళీ జన్మకలుగుతుంది. పంచాగ్నుల సంయోగంవల్లనే జన్మకలుగుతుందని వేదం చెపుతున్నది. ఆకాశం, మేఘం, భూమి, పురుషుడు, స్త్రీ అను ఈ అయిదింటి సంబంధంనుంచీ జన్మ కలుగుతుందని వేదం.

యజ్ఞయాగాదులు కామ్యకర్మలు వివేకం విరక్తివల్లనే లభిస్తుంది. హంస నీటిని విడదీసి పాలను త్రాగినట్లు వివేకి సంసారంలో ఉంటూనే బంధాన్ని పరిత్యజిస్తాడు.

ఒక హంస మరియొక హంస సాయంతో పాలనుంచి నీళ్ళను

విడగొట్టగలిగినప్పుడే వివేకి మరొక వివేకి సాయంతో మరింత వివేకాన్ని పొందగలడు.

రాగోపహతుడైనవాడికి, అనగా ప్రేమవల్ల బాధింపబడేవాడికి కామ చారిత్వం లభించదు. అనగా తన యిష్టంవచ్చినట్లు తిరిగే శక్తి నశిస్తుంది. ప్రియాపరిష్వంగంకోసం పడే పరితాపమే బంధమవుతుంది.

చిలుక మాటలు నేర్పితే నేర్చుకొంటుంది. అందుకోసమే దానిని అందరూ పంజరంలో పెట్టి బంధిస్తారు. మాటలు నేర్చే చిలుక గుణంలాగే అనురాగాదిగుణాలు కూడా బంధకారణా లవుతున్నాయి.

పోనీ భోగాలను పూర్తిగా అనుభవించినందువల్ల శాంతిలభిస్తుందా అంటే అదికూడా అబద్ధమే.

సౌభరి అనే ముని చచ్చేదాకా భోగాలు అనుభవించినా కోరికలు తీరవన్నాడు. అవసానకాలంలో ఈ సత్యాన్ని తెలుసుకొన్నాడు. కోరికలతో ఇతరములందు చిక్కుకున్న చిత్తం పరమార్థంలోకి ఎలా ప్రవేశించగలదు?

కనుక అనురాగం కలుగుతున్నప్పుడే దోషాలను వెదకాలి. దోషాలు దొరకగానే అనురాగం నశిస్తుంది.

అజుడు భార్యా వియోగదుఃఖంలో ఏడుస్తూవుంటాడు. ఆ సమయంలో బ్రహ్మదేవుడే స్వయంగా వచ్చి వివేకోపదేశంచేసినా చెవికి ఎక్కదు. చిత్తం మలినంగాఉన్న దశలోఉపదేశబీజాలు అంకురించవు.

మలినంగాఉన్న అద్దంలో ముఖం సరిగా కనబడనట్లు మలినంగా ఉన్నా చిత్తంలో గురోపదేశం సరిగా ప్రతిబింబించదు.

బురదలోంచి పుట్టిన కమలానికి బురదఅంటినట్లు మలినచిత్తంలో ప్రవేశించిన వివేకానికికూడా మాలిన్యం అంటుకొంటుంది

వివేకం సిద్ధించినప్పుడే కృతార్థతగాని, కొన్నికొన్ని సిద్ధులు లభించినంతమాత్రాన కృతార్థతకాదు.

# 5

# శుభకర్మలు

ప్ర: వివేకం వల్లనే మోక్షం లభించేటట్లయితే శుభ కర్మలు (మంగళాచరణాలు) ఎందుకు చెయ్యాలి? అన్న దానాలు, సత్రవుల నిర్మాణం, చలివెందరలు వంటి మంగళా చరణాలన్నీ వృథాయేకదా !

జ : మంగళాచరణాన్ని శిష్టులు చేస్తూవచ్చారు. శుభకర్మలవల్ల శుభఫలాలను వారు పొందారు. శ్రుతులుకూడా శుభకర్మలను ఆచరించమని చెప్పాయి. అందుకే సచ్ఛీలం కోసం శుభకర్మాచరణ చెయ్యాలి. దుష్ట కర్మాచరణం లోకకంటక మవుతుంది. శుభ కర్మాచరణంవల్ల లోక శ్రేయస్సు కలుగుతుంది. ఆత్మశాంతి లభిస్తుంది. కుర్వన్నేవేహ కర్మాణి జీవిషేచ్ఛతన్ సమాః అంటుంది వేదం. శుభకర్మలుచేస్తూ జీవించ మంటుంది. వివేకవంతుడైనందుకు శుభకర్మలు చేయవలసిందే.

ప్ర : కర్మలన్నిటికీ ఫలం ఉంది అంటున్నారు. కూలి పని చేసిన వాళ్ళందరికీ యజమాని నుంచి కూలి లభిస్తుంది. అలాగే శుభకర్మలు చేసేవాళ్ళందరికీ శుభ ఫలాల నివ్వటానికి ఈశ్వరుడంటూ ఉండాలా ?

జ : కర్మనుబట్టి ఫలం లభిస్తున్నందున, కర్మ ఈశ్వరాధీనమే. కనుక ఈశ్వరుడు లేడనుట సత్యం కాదు.

ప్ర : పనులు చేసేవాళ్ళు ఒక్కరు, వాటికి అధిష్ఠాత (యజమాని) ఒకరూ అనటం ఏమి బావుంది ? స్వసంకల్పం

వల్లనేకదా ఎవరైనా పనులు చేస్తున్నారు ! వారి పనులకు వారు కర్తలుగాక మరెవడో ఈశ్వరుడు కర్త అనటం న్యాయంగా ఉందా ?

జ : లోకంలో ప్రజలు చేసే మంచి చెడ్డలకు రాజే బాధ్యత వహిస్తున్నాడు. దుష్కర్మలను శిక్షించటం, సత్కర్మలను సత్కరించటం రాజు చేస్తున్నాడు. అలాగే పరమేశ్వరుడు కూడా.

ప్ర : రాజు తనకు ఉపద్రవం కలగకుండా విప్లవకారుల్ని శిక్షిస్తాడు; తన క్షేమానికి దోహదపడే వారిని సత్కరిస్తాడు. ఈశ్వరుడు కూడా అంతే అయితే ఈశ్వరుడు అల్పుడే అవుతున్నాడు. అతనిలోనూ లోపాలుంటాయి.

జ : లోపాలుండేవాడే అయితే అతను ఈశ్వరుడు కాలేడు. రాజే అవుతాడు. పరమేశ్వరుడు సర్వసమ్మతుడు.

ప్ర : అలాంటివాడు కర్మల కధిష్ఠాత ఎట్లా అవుతున్నాడు ? అతనికి రాగద్వేషా లున్నాయా ?

జ : కర్మ ఈశ్వరునిచేరే సాధనం. పుణ్యకర్మల ద్వారా ఈశ్వర ప్రసన్నతను పొందడం జరుగుతున్నది. ప్రీతినియత కారణత్వాత్-రాగం లేకుండా ప్రవృత్తి కలగదు గనుక అతనికి రాగం ఉన్నందువల్లనే కర్మాధిష్ఠాత అవుతున్నాడు

ప్ర : అయితే నిత్యముక్తుడెలా అవుతాడు ?

జ : కరుణతో సంబంధం ఉన్నంత మాత్రాన అతని నిత్యముక్తత్వానికేమీ లోపంలేదు. కరుణ ఈశ్వర స్వభావం గనుక అదే ఐశ్వర్యం.

ప్ర : జీవుడికీ, ఈశ్వరుడికీ ప్రకృతి సంబంధం సమానమే గదా! కరుణాంతరంగు డయిన జీవుడు ఈశ్వరు డెందుకు కాలేడు ?

జ : జీవుడు సంగరహితుడు కాలేడు. జీవుడు ప్రకృతిలోనే జీవిస్తున్నాడు. ఈశ్వరుడు ప్రకృతికి అతీతంగా జీవిస్తున్నాడు. ఈశ్వరుడు సంగరహితుడు. సంగమనగా (Involvement).

ప్ర : ఈశ్వరుడు సంగరహితుడని అన్నారు. జీవుడు సత్తా లేకయే తటస్థత వహించి ప్రకృతియందు లీనం కాకుండా ఉంటున్నాడు. అలాంటి జీవులందరూ ఈశ్వరు లవ్వాలి గదా!

జ : ఆ రకం సర్వైశ్వర్యమే తటస్థత ఉన్నంత మాత్రాన కలగదు.

ప్ర : అందరూ ఈశ్వరు లయిపోతే వచ్చే ప్రమాద మేమిటి ?

జ : జీవులందరికీ మరణం ధృవం. కనుక సర్వైశ్వర్యమ్ సిద్ధించదు. అలా అందరూ ఈశ్వరులయినట్లు ప్రత్యక్ష ప్రమాణం లేదు.

ప్ర : పోనీ అనుమాన ప్రమాణం ఉందా ?

జ : జీవుడే ఈశ్వరుడని సాధించటానికితగ్గ సంబంధ అభావంవల్ల అనుమాన ప్రమాణం కూడా లేదు.

వేదాలు కూడా ప్రకృతి కార్యరూపాన్ని ధరిస్తుందని చెప్పాయేగాని జీవుడీశ్వరు డవుతాడని చెప్పలేదు.

ప్ర : మాయా సంబంధంవల్ల విజ్ఞానబ్రహ్మ అజ్ఞానేశ్వరుడు అయే అవకాశం లేదా ?

జ : లేదు. ఈశ్వరుడు నిస్సంగుడు. విజ్ఞానమే దానికి కారణం. కనుక మాయా సంగమం జరుగుతుందనటమే తప్పు

అవిద్య అనగా అజ్ఞానం. అది వస్తువుకాదు. గుణంకూడా కాదు. విజ్ఞానం గుణం. గుణంకాని అజ్ఞానం సిద్ధిస్తుందా ? లేదా అని ఆలోచించటం అనవసరం సిద్ధించటమే జరిగితే అన్యోన్యాశ్రయంవల్ల కొంత ఈశ్వరత్వం అజ్ఞానానికి లభిస్తే కొంత అజ్ఞానం ఈశ్వరుడికీ లభిస్తుంది. ఇంతకీ విజ్ఞానం లేకపోవటమే అజ్ఞానంగాని అజ్ఞానం విజ్ఞానంలా పొందగల విశేషమేమీ కాదు.

ప్ర : విజ్ఞానానికీ అజ్ఞానానికీ ఉన్నసంబంధం బీజాంకుర సంబంధంవంటిది. ఒకదానినుంచి ఒకటి విడదీయరానిది.

జ : తప్పు. విద్యాభిన్నత్వమే అవిద్య అయితే అదికూడా విద్యయే అనిపిస్తుంది. అజ్ఞానం పుటుకతో ఉండేదేగాని నేర్చుకుంటే వచ్చేది కాదు.

ప్ర : విద్యయొక్క భిన్నత్వాన్నే విద్యాన్యత్వ మని అంటాము. అది క్రియ.

జ : ఆ ప్రసంగమే వివేకానికి బాధ కలిగిస్తుంది. ఈ సృష్టి సమస్తమూ ఒక క్రియ అది విద్యకాదు. విద్యవల్ల అవిద్య నశించినట్లయితే వివేకంవల్ల ఈ సృష్టి నశించవలసివస్తుంది.

ప్ర : ఈ ప్రపంచం మాయామేయం కదా ! కనుక విద్యవల్ల ఈ సృష్టి నశించకుండా మాయ కాపాడుతుంది.

జ : అప్పుడు విద్యయే నిష్ఫలమవుతుంది.

ప్ర : విద్యాన్యత్వం అవిద్య కాదంటారా? సరేలెండి. విద్యచే బాధింపబడేది అవిద్య అనవచ్చా?

జ : అవిద్య విద్యచే బాధింపబడేదే అయితే ఈ జగత్తుకూడా విద్యచేతనే బాధింపబడవలసి ఉంటుంది.

ప్ర : జగత్తు అజ్ఞానమయం గనుక !

జ : అయితే జగత్తుకు ఆది ఉన్నట్లే అజ్ఞానానికి కూడా ఆది ఉన్నట్లవుతుంది. ఆది అనాది.

## ధర్మఫలం :

ధర్మాధర్మాలనేవి అదృష్టాలు. అవి సిద్ధించినప్పుడే వాటికి ఫలం లభిస్తుంది. ఫలం ఎప్పుడయితే లభిస్తుందో, ఫలాన్ని యిచ్చే ఈశ్వరుడు కూడా సిద్ధిస్తున్నాడు. అదృష్టమే లేనప్పుడు ఈశ్వరుడు మాత్రం ఎలా సిద్ధిస్తాడు ?

ఈలోకంలో కొందరు సుఖంగా వుంటే కొందరు దుఃఖంగా వుంటున్నారు ఈ సుఖదుఃఖాలలో కూడా తరతమ భేదా లుంటున్నాయి. కొందరు సామాన్య దుఃఖంలో ఉంటే, కొందరు విశేష దుఃఖంలో ఉంటున్నారు అలాగే సుఖించేవారు కూడా. ఈ సుఖదుఃఖాలను ప్రకృతి కార్యాలని అంటాము వీటినే అదృష్టమని శాస్త్రకారు లంటారు. ఒక్కొక్కడి అదృష్టం ఒకోలా ఉంటున్నది ఈ సుఖదుఃఖాలలోని వైచిత్ర్యం ధర్మాధర్మాలు లేకుండా ఏర్పడదు, కాబట్టి ధర్మాధర్మాలు ఉన్నాయి. అవి లేవనకూడదు.

ప్ర: ప్రకృతి కార్యాలయందు స్వభావ ధ్ధంగా వైచిత్ర్యం ఉంటుంది. అంతమాత్రాన అదృష్టం ఎందుకు ?

జ: అదే చెప్తున్నా. శ్రుతి, లింగం, యోగజప్రత్యక్షము-అను మూడు కారణాలవల్లా అదృష్టం ఉన్నట్లు కనిపిస్తోంది.

పరోపకారాయ పుణ్యాయ, పాపాయ పరపీడనమ్-అని. పరులకు ఉపకారం చేయటం పుణ్యమూ, అపకారం చేయటం పాపమూ అని శ్రుతి చెప్తున్నది. కనుక పుణ్యపాపాలు కర్మఫలా లవుతున్నాయి. పుణ్యం వల్ల సుఖమూ, పాపంవల్ల దుఃఖమూ కలుగుతాయన్నది లోకానుభవమే. ఇది శ్రుతి.

లింగమనగా "హేతువు". ఈ పుణ్యపాపాలు అనుభవైకవేద్యాలే గాని దృశ్యాలు కావు కనుక కనబడనివి. కనబడనివాటిని అదృష్టాలని చెప్తాము. కనుక సుఖదుఃఖాలు అదృష్ట జన్యాలని హేతువు.

ఈ సుఖఫలం, దుఃఖఫలం అనుభవ ప్రత్యక్షములు. అనగా సిద్ధించుటతో కంటికి ప్రత్యక్షంగా కనిపిస్తాయి. వాటిని చూసి అదృష్టవంతుడనో, దురదృష్టవంతుడవో మనం అంటుంటాము.

ప్ర: సుఖదుఃఖాలు అదృష్టజన్యాలని అన్నారు. అదృష్ట మనగా కనబడనిది. . కనబడనిది లేదని ఎందుకు అనుకోకూడదు ?

జ; ఒక వస్తువు ప్రత్యక్షంగా లేనంత మాత్రాన లేదనకూడదు. అది శబ్దప్రమాణంచేత గాని, అనుమాన ప్రమాణంచేత గాని సిద్ధించే అవకాశం వుంది.

అధర్మం కూడా ఇలాగే సిద్ధిస్తుంది.

ప్ర : ధర్మంలాగే అధర్మం కూడా సిద్ధిస్తుందని ఊహించుకోవటం దేనికి ? అర్థాపత్తి వల్ల సిద్ధించదా ?

జ : (ఒక విషయాన్ని చెప్పినపుడు దానికి సంబంధించిన మరో విషయం చెప్పకుండానే సిద్ధించటాన్ని అర్థాపత్తి అంటాము.) అధర్మం అర్థాపత్తి ద్వారా సిద్ధించినప్పుడు, ధర్మం కూడా అధర్మానికి అర్థాపత్తి ద్వారానే సిద్ధిస్తుంది. కనుక ఒకదాని కొకటి అర్థాపత్తి అవుతాయి. అది తుల్యస్థితి.

ప్ర : ధర్మమూ, అధర్మమూ అనేవి గుణాలు కదా !

జ : అవి గుణాలు కావు. అంతఃకరణ ధర్మాలు.

ప్ర : అవి నశించవా ?

జ : గుణాలయితే స్వరూప నాశనం పొందవు. సత్త్వం రజస్సు, తమము యిలాంటివి. ధర్మాలు స్వరూపనాశనం పొందుతాయి. కాలిన యినుము వేడిగా ఉండటం ధర్మం. ఆ వేడి కొంతసేపటికి చల్లారటం ధర్మం. కనుక మొదటి ధర్మం పోయి రెండవ ధర్మం వచ్చింది. మొదటిది అధర్మ మయితే రెండవది ధర్మ మవుతుంది. ధర్మాధర్మాలు ఒకదానినొకటి నాశనం చేస్తాయి. అలాగే సుఖదుఃఖాలు కూడా. ఒకటిపోతే ఒకటి కలుగుతుంది.

## అనుమానం :

ప్ర : మనం సుఖపడుతున్నామో, దుఃఖపడు

తున్నామో స్వానుభవం నుండి తెలుసుకోగలుగు తున్నాము. ఇతరులు సుఖపడుతున్నారో, దుఃఖపడుతున్నారో ఎలాగ తెలుసుకోటం ?

జ : అనుమాన ప్రమాణంవల్ల. దానికి ప్రతిజ్ఞ, హేతువు మొద లైన అయిదు అవయవా లున్నాయి. వీటిద్వారా యితరుల సుఖదుఃఖాలను గుర్తించవచ్చు.

ప్ర : అనుమానం వ్యాపిస్తుందంటారు అదెలాగ ?

జ : ఆనోటా ఆనోటా పడి వ్యాపించటం సంగతికాదు, అనుమా నానికి వ్యాప్తి ఉన్నది. ఒక వ్యక్తికి సుఖంగాని, దుఃఖంగాని సాధ్య మయితే దానిని అనుసరించే సాధనం కూడా ఉంటుంది. ఏ సాధనంవల్ల అతనికి ఈ దుఃఖంగాని, సుఖంగాని సాధ్యమయ్యాయో శాస్త్ర వివేకంతో చూడటమే వ్యాప్తి ఒకణ్ణి హత్యచేసి ఒకడు ఉరికంబం ఎక్కాడు. వాడు ఉరికంబం ఎక్కటం సాధ్యమయితే, వాడు చేసినహత్య దానికి సాధన మయింది. ఈ రకం సాధ్యసాధనాల సంబంధం సిద్ధిస్తే ఇతరుల సుఖదుఃఖా లను కూడా గ్రహించవచ్చు.

ప్ర : మరి 'వ్యాప్తి' అన్నారేమిటి ?

జ : నియతధర్మ సాహిత్యమే వ్యాప్తి అని చెప్పబడుతున్నది. వ్యాప్తి univers l truth without an expresion. సాధ్యసాధనాల సం బంధం అవిభాజ్యమై ఉంటుందనేది వ్యాప్తి. నువ్వుగింజలో నూనె ఉంటుంది సాధ్యం నూనె: సాధనం నువ్వుగింజ. ఈ రెండింటికీగల అవిభాజ్యసంబం ధమే వ్యాప్తి. సాహిత్య మనగా సన్నిహితత్వం. నువ్వుగింజకు నూనె, నిప్పుకు వేడి సన్నిహిత ధర్మాలయి ఉన్నాయి.

ప్ర : నియతధర్మ సాహిత్యమే వ్యాప్తి అనుకునే కంటే తత్త్వాంతరమని ఎందుకనుకో కూడదు ?

జ : తత్త్వమే (లోపల ఉన్నదే) గాని, తత్త్వాంతరంకాదు. నువ్వుగింజల తత్త్వం నూనెను కలిగిఉండటమే. తత్త్వాంతరమంటే అందులో ఉండటానికి అవకాశంలేని మరో పదార్థం ఉన్నట్లుగా ఊహించటమవుతుంది కనుక ధర్మసాహిత్యమే వ్యాప్తి అని చెప్పక తప్పదు.

ప్ర : ఈ సాహిత్య మేదో కొత్తగా ఉంది.

జ : నిజశక్తినుండి ఏదయితే ఉద్భవించిందో అదే సాహిత్యమని సాంఖ్యాచార్యులు చెప్పారు. నువ్వుగింజయొక్క నిజమైన శక్తినుండే నువ్వుల నూని ఉద్భవించింది గదా !

స్వభావం చేతనే రెండు వస్తువులు ఒకదానితో ఒకటి సంబద్ధమైతే ఉంటాయి. నువ్వుల్లో నూనె సంబద్ధమై ఉంది. నూనెగింజలు నూనెతో సంబద్ధమయ్యాయి. కనుక నూనెగింజలు వ్యాప్యం. నూనెగింజల్లో నూనె వ్యాపకమయి ఉంది. అందుకే సృష్టిలో అన్నిటికీ ఏదో ఒక వ్యాపకం ఉన్నదని చెప్పటం అదే స్వరూపశక్తి.

ప : మీకు వ్యాపకమంటే జ్ఞాపకమొచ్చింది. పంచశిఖాచార్యుడు 'ఆధేయశక్తియోగ' మన్నాడు గదా ? అది "స్వరూపశక్తి"కి అపచారం కాదా !

జ : నూనెకణాన్ని కలిగిఉండటమే నువ్వులగింజ స్వరూపమని మీరంటున్నారు. ఆ నువ్వుగింజకు స్వరూపశక్తిడే నూనె కణమని మీ అభిప్రాయం. అది సత్యమే. అందులో నూనెకణం లేకపోతే నువుగింజే

కాదు. నూనెకణమే నువ్వుగింజకు సంకేతం (ఆధేయం). కనుక అది ఆధేయశక్తి కూడా అయింది. ఈ రెండూ వేర్వేరు కాదు. వేర్వేరుగా చెప్పటం జరిగితే పునరు క్తి దోషం కలుగుతుంది.

ప్ర : పునరుక్తిదోషం ఎందుకు కలగాలి ?

జ : నూనె స్వరూపాన్ని చూడగానే దాని విశేషణం గురించి ఆలోచిస్తాము. నువ్వులనూనె, వేరుసెనగనూనె, ఆవనూనె, ఆముదంనూనె, కొబ్బరినూనె-అని. విశేషణా నర్థక్య ప్రసక్తః- ఆ విశేషణం తెలియక పోతే అనర్థం కలుగుతుంది. ఆముదంనూనె అను విశేషణ పూర్వపద కర్మధారయాన్ని తెలియకుండా నూనె అనుకొని అన్నంలో వేసుకొంటే....? అనర్థం కలగదా ? కనుక స్వరూపశక్తి ప్రమేయం లేదు.

ఆధాన మనగా సంకేతం. అట్టిది ప్రధానంగా గల శక్తిని ఆధేయ (సాంకేతిక) శక్తి అంటారు. వ్యాప్యాన్ని వ్యాపకంనుంచి వేర్పరచి తెలియజేస్తుంది. నువ్వులు వ్యాప్యము, నూనె వ్యాపకమూ అయి సాంకేతికంగా నువ్వులనూనె అని చెప్పబడుతున్నది. ఇలా వేర్పరిచి వుంచటంలో ఆధేయశక్తికి ప్రాధాన్యత కలుగుతున్నదని పంచశిఖాచార్యు డన్నాడు.

ప్ర : నువ్వు గింజనుచూడగానే దాని స్వరూపాన్ని బట్టి నువ్వులగింజలనీ, అందులో నూనెకణం ఉంటుందనీ అర్థమవుతుంది. అదే స్వరూపశక్తి అని నాఅభిప్రాయం. దాని స్వరూపాన్నిబట్టి గింజతోబాటు నూనె ఉనికిని కూడా గ్రహిస్తాము. "వ్యాప్తియే" కదా !

జ : కాదు. చెట్లచిగుళ్ళను కోసి, రాశిగా పోసి వుంచారు. ఆ రాశిని చూసి చెట్టు అనుకోము. కనుక యిక్కడ వ్యాప్తి అనుపపత్తి

unborn అవుతున్నది. స్వరూపశక్తియే వ్యాప్తి అయితే ఈ పల్లవాలను (చిగుళ్ళను) చూపినా చెట్టు అనుకోవాలి. అవేపల్లవాలు చెట్టునుండగా కనిపిస్తే అప్పుడు పల్లవభావం కలుగదు. చెట్టుభావమే కలుగుతుంది. కనుక స్వరూపశక్తి సర్వదా వ్యాప్తి కాబోదు

ప్ర: పోనివ్వండి. నువ్వులగింజకు నిజమైనశక్తి నూనె. నూనెకూ దానికీ ఉన్న నిజమైన సంబంధమే వ్యాప్తి ఎందుకు కాకూడదు? ఆధేయశక్తియే ఎందుకు కావాలి?

జ: పంచశిఖాచార్యులు మాత్రమే ఆధేయశక్తి గురించి ప్రస్తావించారు. తక్కిన్మా సాఖ్యాచార్యు లందరూ నిజశక్తి సంబంధం గురించే చెప్పారు. ఈ రెండూ సమానమే. కాని, చిన్నభేదం ఉంది. నూనె వరకూ నువ్వులకు. వేరుసెనగకూ, ఆముదానికీ. అవకూ ఒకటే సంబంధం. కాని ఆ సంబంధం సాంకేతిక ప్రయోగంవల్ల (గానుగ, మర వగైరా) విడగొట్టబడటం సాధ్యం కనుక పంచశిఖాచార్యులు ఆధేయశక్తి సంబంధం అని వేరుగా పేర్కొన్నారు.

## శబ్దార్థసంబంధం:

ప్ర: మీరు అనుమాన ప్రమాణాన్ని నిరూపించటానికిగాను సాధ్యసాధన సంబంధాన్ని గురించి యింత వివరించారు. శబ్దార్థసంబంధాన్ని గురించి వివరించండి.

జ: శబ్ద, అర్థం అను ఈ రెండింటికీ మధ్య వాచ్యవాచకభావ సంబంధం ఉంది. దీనికే 'వృత్తి' అని పేరు. శబ్దార్థాలకున్న సంబంధం తెలిసినట్లయితేనే అది అర్థమవుతుంది. లేకుంటేకాదు.

ప్ర : ఒక భావాన్ని తెలియజేయటానికే శబ్దం నిర్దిష్టమయింది. ముందుగా అర్థం తెలిస్తేగాని శబ్దం అర్థంకాదు. శబ్దానికీ, అర్థానికీ ఉన్న సంబంధజ్ఞానం కొంతలో కొంతయినా ఉండాలిగదా ! అదెలా లభిస్తుంది ?

జ : ఉండాలి. అది లేకనే పరభాష అర్థంకాదు ఈ సంబంధజ్ఞానం మూడింటివల్ల లభిస్తుంది. 1) ఆప్తోపదేశం 2) వృద్ధవ్యవహారం 3) ప్రసిద్ధపద సాన్నిధ్యం.

1) తల్లి నేర్పినభాష ఆప్తోపదేశమే. 2) పెద్దలవాడుక నుంచి ఏర్పడినది అర్థసంబంధం. 3) అందరికీ తెలిసిన పదాలు ఈ శబ్దానికి అర్థంగా ఉండటం— ఈ మూడింటివల్లా శబ్దార్థాలకుగల సంబంధజ్ఞానం కలుగుతుంది.

ప్ర : ఈ సంబంధజ్ఞానం వస్తువునందు లభిస్తుందా ? లేక కార్యమునందు లభిస్తుందా ?

జ : రెండింటియందూ లభిస్తుంది. "ఆవు నెమరు వేస్తున్నది" అంటే ఆవూ కనిపిస్తుంది, అది నెమరువేయటమూ కనిపిస్తుంది.

ప్ర : సరే. మీరు లౌకికవ్యవహారం చెప్తున్నారు వేదార్థప్రతీతి మాట నేనంటున్నాను.

జ : లోకే వ్యుత్పన్నస్య వేదార్థ ప్రతీతిః- లోక వ్యవహారంలో వ్యుత్పన్నుడైన వాడికి (పండితునికి) వేదార్థప్రతీతికూడా కలుగుతుంది. లోకవ్యవహారమే శాస్త్రం గనుక.

ప్ర : క్షమించండి. వేదాలు అపౌరుషేయాలు.

వేదార్థం అతీంద్రియమైనది. కాబట్టి మీరు చెప్పిన ఆప్తోప దేశాది త్రివిధోపాయాలద్వారా అది లభించదు.

జ : యజ్ఞం, జ్ఞానం, తపస్సు అను మూడూ వేదార్థాలు. అవి యింద్రియ గోచరం కావనటం యుక్తం కాదు. వైదిక భాష నెరిగిన వృద్ధుల వ్యవహారమే వేదమయింది. కనుక మూలభాషను ప్రసిద్ధపద సాన్నిధ్యాన్నిబట్టి గ్రహించవచ్చు.

అదీగాక 'వ్యుత్పత్తి'నిబట్టి, అనగా శబ్దానికి గల నిజశక్తిని బట్టి, అర్థనిర్ణయం చెయ్యనూవచ్చు.

'పంకజం' అను శబ్దం ఉన్నది. పంక మనగా బురద; 'జ' అనగా పుట్టుట; బురదనుండి పుట్టినది అని అర్థం. ఇది వ్యుత్పత్తి. సందర్భాన్ని బట్టి పద్మమని అర్థం చెప్పుకోవచ్చు.

శబ్దపరిచయం గలవారికి శబ్దార్థసంబంధజ్ఞానం ఏ కొంచెం వున్నా వాచకంలోని అంతర్వాణి ( Soul ) సులువుగా తెలుస్తుంది.

యోగ్యాలు, అయోగ్యాలు అయిన శబ్దాలకు కూడా కొంత ప్రతీతి ఉంటుంది. దానివల్ల సంబంధజ్ఞానం కలుగుతుంది.

సుగంధానికి 'వాసన' అని అర్థం. దుర్గంధానికి కూడా అదే 'వాసన' వస్తు ది. కనుక యోగ్యా యోగ్య శబ్దార్థ ప్రతీతివల్లనే మనకు సంబంధ జ్ఞానం కలుగుతోంది.

ప్ర : శబ్దార్థాల సంబంధం స్వాభావికమే కదా! వేదార్థం సామాన్యజనాని కెందుకు లభించదు ?

జ : వేదాలకు నిత్యత్వం (Eternity) లేనందున వేదాలలో కార్యాలగురించి బోధించటం జరిగింది. కాలక్రమేణా కార్యాలు మారాయి. వీటికి కారణాలు మారాయి. కనుక వైదిక కార్యాలకు, తద్వారా వేదాలకూ నిత్యత్వం లేకుండా పోయింది.

[తస్మాత్ యజ్ఞాత్ సర్వహుత ఋచః
సామాని జజ్ఞిరే. ఛందాంసిజజ్ఞిరే
తస్మాద్యజు స్తస్మాదజాయిత ॥

ఆ కారణంవల్ల సర్వహుతుని (పరమేశ్వరుని) కీర్తనలు సామములు, ఛందములు, యజస్సు అయినవని యజుర్వేదం చెప్పింది.] కనుకనే అవి స్వాభావికం కావు; నిత్యమూకావు.

ప్ర : అవి స్వాభావికాలుగాని, నిత్యం గాని కాకపోతే పోయె. పౌరుషేయత్వం కూడా లేదా ?

జ : మనుష్యులచే సృష్టింపబడటమే పౌరుషేయత్వం. వేదాలను ఎవరు రచించారో తెలియదు : అందుకే వాటిని అపౌరుషేయా లన్నారు.

ప్ర : రచయిత లెవరో తెలియకపోతే అది మన దురదృష్టం. అంతమాత్రాన వేదాలు అపౌరుషేయాలు ఎలా అవుతాయి ?

జ : జీవుల్లో ముక్తు లున్నారు. వారికి దేనియందూ ఆసక్తి ఉండదు. కనుక వారీపని చేసిఉండరు. ఇక అముక్తులయిన వారున్నారు. వారు వేదాలను రచించటానికి యోగ్యులే కాదు. కాబట్టి వేదాలను మానవులే వ్రాశారనటానికి వీల్లేదు.

ప్ర : మనుష్యు లెవరూ వేదాలను వ్రాయటానికి యోగ్యులు కారంటున్నారు. వాటి రచయిత లెవరో తెలియదంటున్నారు. అవి నిజంగా పరమేశ్వరప్రణీతాలే అయితే 'నిత్యం' కావాలి గదా !

జ : భూమిపై ఎన్నో మొలకలు అంకురిస్తున్నాయి. వాటిని మానవమాత్రు తెవరూ సృష్టించ లేదు. వాటికవే పుడుతూ చస్తూవున్నాయి. వాటికి నిత్యత్వం లేదేమి ?

ప్ర : అంకురించటం కార్యమే. దానిని చేసిన జీవుడూ వేరే ఉన్నాడు. దాని విత్తనమే కదా యిది! అంకురించటం జీవకార్యం కనుక అనిత్యమని అనుమానిస్తున్నాను.

జ : జీవులచే నాటబడని మొక్కలకు కర్తృత్వం జీవుడిదే అంటే ప్రత్యక్షాన్ని కాక అదృష్టాన్ని అంగీకరించవలసి వస్తుంది,

ప్ర : అలా అయితే కర్తృత్వాన్ని తెలుసుకోవటం ఎలా ?

జ : ఏ వస్తువును చూస్తే అది ఎవరిచేతనో ఒకరిచేత తయారు చేయబడిన ట్లనిపిస్తుందో దానిని పౌరుషేయ మని చెపుతున్నాం. అట్టి కృతబుద్ధి వేటియందు కలగదో అవి అపౌరుషేయాలు. ఆ అర్థంతో చూడండి.

## వేదప్రామాణ్యత :

ప్ర : వేదాలలో పరతః ప్రమాణం కనబడ దేమి ?

జ : వేదాలు స్వశక్తితో అభివ్యక్తమయినందున వాటికి స్వతః ప్రామాణ్యత ఉన్నది. అనగా వేదాలు వాటికవే ప్రమాణం.

తన అర్థాన్ని వ్యక్తం చేయటంలో బలం కోసం మరొక ప్రమాణాన్ని ఉదాహరించటం జరగనిది స్వతః ప్రమాణం. అలా కాక వారు యిట్లు చెప్పిరి, వీరు అట్లు చెప్పిరి అంటూ తన వాదాన్ని బలపరుచుకోవటం కోసం యితర గ్రంథకర్తల వాక్యాలను ఉదాహరిస్తూ పోవటం పరతః ప్రమాణం.

వేదాలకు నిజశక్తి వున్నందున పరతః ప్రమాణం అవసరం లేదు.

## భ్రాంతిజ్ఞానం :

ముత్యపుచిప్ప లోపలి పూతను చూచి అది రజత మనుకొనే మూర్ఖులు కూడా లోకంలో చాలామంది ఉన్నారు. అందులో వెండి ఆవంతయినా లేదని బుద్ధిమంతు లందరికీ తెలుసు.

ముత్యపుచిప్పలో ఏ వెండీ లేకపోయినా ఉన్నట్టు అనిపిస్తుంది గనుక; వస్తువు బొత్తిగా లేకున్నా వస్తుజ్ఞానం కలుగుతుందని కొందరంటున్నారు.

లేని వస్తువుకు సంబంధించిన జ్ఞానం ఎలా కలుగుతుంది ? మనుష్యులకు కొమ్ము లుండవు కొమ్ములున్నట్లు వుండే జ్ఞానం ఎవరికయినా కలుగుతుందా ?

ప్ర : ముత్యపు చిప్పలో వెండి లేకపోతే పోనియ్యండి. అసలు వెండి ఎలా ఉంటుందో తెలియకనా ? కాని ముత్యపు చిప్ప లోపలిభాగం వెండితో మలామాచేసినట్లు అనిపిస్తుంది.

జ : అది ఉత్ప్రేక్ష. ఆహా యిది వెండిలా ఉందనుకొంటున్నప్పుడే, అంతర్వాణి చెబుతూ ఉంటుంది అది వెండి కాదని. కనుక వెండి పూతలా కనిపించినా అది వెండి అనే భావం బుద్ధిమంతు డెవరికీ కలగదు.

విజ్ఞానవాదు లొకలా అంటారు శుక్తియందు కలిగే రజతజ్ఞానం విజ్ఞానరూపంలో మిగిలిన రజితజ్ఞానమే నంటారు. అప్పుడే కదా అది వెండిలా కనిపించటం ; వాళ్ళు విజ్ఞాను లయితే వాళ్ళకి ఆమాత్రం తేడా తెలుస్తుంది. కనుక భ్రమపడవలసిన అవసరం ఉండదు.

ప్ర : వెండిలా కనిపించే శుక్తి వెండి కాదు, వెండి కానట్టూ కాదు. అదొక అనిర్వచనీయ స్థితి. ఏమంటారు ?

జ : శుక్తియందు కలిగే రజత జ్ఞానం ఒకానొక అనిర్వచనీయ భావమంటారు అనిర్వచనీయవాదులు. కాని అనిర్వచనీయ స్థితి అంటూ ఏ పదార్థానికీ లేనందున ఈ వాదాన్ని అంగీకరించటానికి వీల్లేదు. అది పదార్థమంటూ కావాలే గాని ఏదయినా నిర్వచనీయమే. ఏది అనిర్వచనీయమో అది లేదు.

ప్ర : 'అన్యథా ఖ్యాతి' వాదులమాటేమిటి ?

జ : అన్యథా ఖ్యాతి is the assertion that something is not really what it appears to be according to sensual perception, వెండిలా కనిపించేది నిజంగా వెండీకాదు; వెండి కానట్లు కనబడేది కాకనూపోదు. ఇంద్రియజ్ఞానం ఆధారపడదగ్గది కాదని అన్యథా ఖ్యాతివాదుల మతం. ఇది వెండి అనే భ్రమకలగటానికి ప్రధానకారణం ఆ ముత్యపుచిప్పలో వెండికి తాదాత్మ్యసంబంధం ఉండటమే నంటారు. రజతత్వం ఇక్కడ సమవాయసంబంధాన్ని పొందిన దంటారు. వెండి

పూర్తిగా లేకపోయినా ఎంతో కొంత పుండటం జరిగినందునే అంతా వెండి అన్నంత భ్రాంతి కలిగిందని అంటారు.

ప్ర : సాంఖ్యు లేమంటారు ?

జ : మేము అఖ్యాతివాదులం. శుక్తి (ముత్యపుచిప్ప) కి రజతమను ఖ్యాతి (కీర్తి) లభించినందున యిన్ని పెదవాదాలు కలిగాయి. మాకా భ్రమలేవీ లేవు. వెండినిచూపిన కళ్ళతో శుక్తిని చూడటంవల్ల ధావళ్య సామ్యంచేత శుక్తిని రజతంగా భ్రమించటం జరిగింది. దీనిని మేము 'సదసత్ ఖ్యాతి' అంటాము. నిజంగా శుక్తిలో రజతం (వెండి) లేదు. వెండితో దానికి సంబంధమూలేదు అయినా వెండిని చూపినకళ్ళకు శుక్తి యందు వెండి ఉన్నట్లు భ్రమ కలగటంవల్ల సరియైన శుక్తిజ్ఞానం కలగటంలేదు. రజతజ్ఞానమే కలుగుతోంది.

## స్ఫోటవాదం :

ప్ర : శబ్దం స్ఫోటాత్మకమని అంటారు. నిజమేనా ?

జ : బుద్ధైః వైయాకరణైః ప్రధానభూత స్ఫోటరూప వ్యంగ్య వ్యంజక్ స్యశబ్ద స్యధ్వనిరితి వ్యవహారః కృతః ఏదైనా ధ్వనిని వినునపుడు మనసున స్ఫురించేభావాన్నే స్ఫోటమని అంటారు.

వ్యాకరణవేత్త గకార ఓకారములు 'గో', వకార ఉకారములు 'వు' 'గోవు' అన్నాడనుకోండి అప్పుడు ఆవు మన మనస్సులో పరిపూర్ణ స్వరూపంతో అవతరిస్తుంది. అట్టి అవతరణనే స్ఫోటమని అంటాము.

దానిని సాంఖ్యులమైన మేము అంగీకరించం వ్యాకరణవేత్త గకార ఓకారములు అని శబ్దోత్పత్తిని వివరించినప్పుడు గకారంనుంచి గానీ,

ఓకారంనుంచి గానీ ఏ అభిప్రాయము కలగదు గావున గోవు అవతరించదు. గకార ఓకారములు, వకార ఉకారములు మాత్రమే అంకురిస్తాయి.

ప్ర : మీమాంసకులు శబ్దనిత్యత్వమే స్ఫోటమని అంటారు. మీరు ?

జ : 'గో' అనుశబ్దం 'వు' అనుశబ్దం పుట్టేసరికే చచ్చిపోయింది. కనుక శబ్దనిత్యత్వం ఎక్కడుంది ?

ప్ర : గ ఓ వ ఉ అను అక్షరాలు ఏకశబ్దంగా జనించి 'గోవు' అని ఒక్కమాటగా స్వరభేదాన్ని కలిగి వినిపిస్తున్న శబ్దం నిత్యం కాదంటే ఎలాగ ?

జ : శబ్దం పుట్టిందని మీరే అంటున్నారు 'వు' అనటంతో శబ్దం చచ్చిందని నేనంటున్నాను. ఈలోగా ఎన్ని స్వరభేదాలొచ్చినా నాకొక్కటే శబ్దం నిత్యంకాదు. "కార్యతాప్రతీతే"—దానికి నిర్దేశించిన పనిఉంది. అది పూర్తి కాగానే పోతుంది.

ప్ర : శబ్దనిత్యత్వ వాదులిలా అంటున్నారు. దీపంతెచ్చి చూస్తేనే చీకట్లో ఉన్న వస్తువులు కనిపిస్తాయి. ఆ వస్తువులు మీరు దీపంతెచ్చి చూడకముందే అక్కడ ఉన్నాయి. ఎటొచ్చీ దీపం తెచ్చిన తర్వాతనే ప్రకటింపబడ్డాయి.

శబ్దం నిత్యమని ఎందుకంటున్నామంటే 'గోవు' అని మీరు బయటకు కేక వేయకముందే లోకంలో గోవులూ ఉన్నాయి. గోవులకు సంబంధించిన జ్ఞానం శబ్దరూపంలో మన మనస్సులోనూవుంది. ఎటొచ్చీ దీపాన్ని తీసుకొచ్చినట్లుగా

నోట్లోంచి 'గోవు' అను మాటను వెలికతెచ్చాము. అంతే, కనుక శబ్దం నిత్యం—అనివారంటున్నారు. శబ్దాలు ఉచ్ఛరింప బడటానికి పూర్వమే మన మనస్సులో లేకపోయినట్లయితే 'గోవు' వంటి మాటలు పైకిరావు. వట్టి శబ్దమే వస్తుంది.

జ : మూగవాడి మనసులో ఉన్న శబ్దాలు పదరూపంలో బయటకు రావుగదా !

ప్ర: అది గుడ్డిదీపం కావటంవల్ల. పైకి సరిగా రాక పోయినా వాడి మనస్సులో ఉన్నాయిగదా !

జ : మనసులో సిద్ధించిన శబ్దాన్ని సాధించటమే 'మాటలాడట' మంటే, అది సత్కార్య సిద్ధాంతమే అవుతుంది.

ఏ కార్యానికయినా ముందు కారణరూపంలో ఉండే కార్యాలే వ్యాపారాంతంలో ప్రకటింపబడతాయి అనిగదా సత్కార్యవాదం. ఈ మా సిద్ధాంతాన్ని బట్టి మనసులో ఉన్నమాట బయటకొచ్చిన మాటకు మూలమని వారు అంగీకరించే పక్షంలో మాకు అభ్యంతరంలేదు.

## ఆత్మాద్వైతవాదం

ప్ర: ఆత్మలు వేర్వేరని కొందరంటారు. ప్రాణులు వేరయినా ఆత్మ ఒక్కటే అని కొందరంటారు. ఆత్మలు రెండు కాదు ఒక్కటే అను ఆత్మాద్వైతవాదాన్ని మీరంగీకరిస్తారా ?

జ : మనిషి మనిషికీ అనుభవంలో తేడా వుంది. ఆత్మలు అనుభవాగారాలని శాస్త్రం. కనుక హేతువును (లింగం) బట్టి ఆత్మలు చాలా

ఉన్నాయనీ, ఒక్కటే ఆత్మ అని భావించటం తప్పనీ మా అభిప్రాయం.

ఒకడి ఆత్మ సుఖిస్తున్న సమయంలోనే ఇంకొకడి ఆత్మ దుఃఖాన్ని అనుభవిస్తున్నది. ఆత్మ ఒక్కటే అయితే అందరికీ సుఖమూ దుఃఖమూ ఏకకాలంలోనే లభించాలి. అలా లభించటం లేదు. కనుక ఆత్మలన్నీ ఒక్కటే కావు.

ప్ర: పోనీ ఆత్మా, శరీరమూ ఒక్కటే-అవి రెండూ వేరు వేరు కావు అనవచ్చా ?

జః ఆత్మలేని శరీరంఉన్నది.అది మృతం. శరీరంలేని ఆత్మ ఉన్నదో లేదోనన్న సంశయంలో వుంది ఏది ఏమయినా ఆత్మలేని శరీరం ఉన్నది. కనుక ఆత్మయూ, శరీరమూ ఒక్కటికాదు. ఒక్కటని చెప్పటం ప్రత్యక్షప్రమాణాన్ని తృణీకరించటమే.

ప్ర: ఆత్మ, జగత్తు – అను రెండూ ఒక్కటికావా?

జ: ఆత్మ, జగత్తు- అను రెండూ ఒక్కటి కావు. దేనికది వేరు. అద్వైత ప్రసక్తిలేదు.

ప్ర: వీటన్నిటికీ మూలమైన దేదీ లేదా ?

జ: ఈ సృష్టికన్న భిన్నమైన దేదో ఉందన్న అన్యపరత్వమే అవివేకుల భావం.

ప్ర: కుండలకు మట్టి ఉపాదాన కారణం. ఆ మట్టి నుంచే కుండలన్నీ తయారయ్యాయి. కుండలు వేరు; మట్టి వేరు అన్నట్లుంది. ఆత్మయే (ఆత్మల సముదాయమే) జగత్తుకు

ఉపాదాన కారణం. ఈ జగత్తు వేరు, ఆత్మవేరు అంటే ఎలాగ ?

జ : విష్వంగత్వంవల్ల కుండమట్టి వేరూ, కుండలు వేరూ అయ్యాయి. కుండమట్టిలో కుండ పెంకులు కలవవు. కుండమట్టి నుండి కుండలు తయారయినా కుండమట్టికి భిన్నంగానే అవి ఉంటున్నాయి. అదే విష్వంగత్వం (Non-entity). ఆత్మ, జగత్తు విషయం కూడా అంతే. ఆత్మ జగత్తునకు ఉపాదాన కారణం కాదు. అవిద్యా కాదు-ఆ రెండూ కాదు.

అవిద్య అనగా మాయ. మాయనుండి జగత్తు పుట్ట లేదు.

## జీవానందం :

ప్ర : జీవాత్మ ఆనందరూపుడే గదా! ఆనందో బ్రహ్మ అని అంటారు.

జ : ప్రతి శరీరంలోనూ ఒక జీవాత్మ ఉన్నది. దానికి ఆనంద రూపం, చిద్రూపం అంటూ రెండు రూపాలు లేవు. సుఖము వేరు; జ్ఞానం వేరు గనుక ; జీవుడికి సుఖదుఃఖాలు రెండూ ఉన్నాయి జీవుడు ఆనంద రూపుడే అయిన పక్షంలో దుఃఖించవలసిన పనిలేదు. లేదా దుఃఖాన్ని కూడా ఆనందించేవాడు కావాలి.

ప్ర : దుఃఖవిమోచనం కలుగగానే సుఖించానని నసుకోవచ్చు!

జ : అమ్మయ్య ! దుఃఖంనుంచి బయటపడ్డా ననుకోవటానికి

బదులు సుఖంగా ఉన్నా ననుకుంటాడు. ఆనందోఽహ మస్మి! ఇది పొరబాటు.

ప్ర: ముక్తావస్థయందు జీవుడు ఆనందం పొందటం లేదా?

జ: మందబుద్ధు లయినవారు ఆనంద మే ముక్తావస్థ అనుకొంటాడు.

## మనస్సు :

ప్ర: ఏదయినా మనస్సులోనే ఉంది. సుఖ మను కుంటే సుఖం, దుఃఖ మనుకొంటే దుఃఖమూ అవుతుంది. అందుకే మనస్సును రాజన్నారు.

జ: మనస్సు అనేది బుద్ధి యింద్రియవ్యాపార మే గనుక, కళ్లూ చేతులూ లాగే అదికూడా పనిచేస్తుంది. అది సాధనమే. ఆ విషయంలో గొడ్డలికీ, దానికీ తేడా లేదు. అంతకు మించి మనస్సుకు ఏ అధికారమూ లేదు.

పైగా మనస్సు క్రియావంత మయినందువల్ల దానికి 'గతి' (motion) ఉన్నదని శ్రుతి చెప్పుచున్నది. కాబట్టి దానికి వ్యాపకత్వం (pervasion) లేదు పైగా దీనిలో కొన్ని భాగాలుకూడా ఉన్నాయి. కనుక దీనిని విభజించే అవకాశంఉంది.

ప్ర: మనస్సు నిత్యమా?

జ; ఈ సృష్టిలో ప్రకృతి, పురుషుడు (Nature, Supreme) తప్ప అంతా అనిత్యమే. కావున మనస్సుకూడా అనిత్యమే.

ప్ర : జీవునికి అవయవా లున్నాయా ?

జ : జీవునిలో భాగాలు లేవు. కనుక జీవుడు నిరవయవి. అనగా అవయవాలు లేనివాడే.

ప్ర : ఆనందం కలిగిఉండటం ముక్తి అవుతుందా ?

జ : జ్ఞానస్వరూపమే ఆత్మ. దానికి ధర్మాలు లేవు. కనుక ముక్తిపొందినవారికి ఆనందం లభిస్తుందనటం సరికాదు.

ప్ర : పోనీ గుణాలను నాశనంచేసుకొంటే ముక్తి లభిస్తుందా ?

జ : ఏ విశేషగుణమూ లేకుండా ఉండటం ముక్తి కాదు ఆత్మకు మనస్సంయోగంవల్లనే విశేషగుణాలు కలుగుతూ వుంటాయి. ఆత్మకు ఏక్రియా లేకుండా ఉన్నందున ఏ విశేష గతీ ఉండదు.

ప్ర : క్షణికవిజ్ఞానమే ఆత్మ అని విజ్ఞానవాదు లంటున్నారు. అది క్షణ క్షణ విషయాకారతవల్ల ఏర్పడుతూ ఉంటుంది. దానివల్ల కలిగే వాసనలే జీవితేచ్ఛను పెంపొందింపజేస్తాయి అవి నశించటమే ముక్తి అంటారు. అవునా ?

జ : ప్రాణులన్నీ క్షణికాలే. ఇక ముక్తి ఏమిటి ?

ప్ర : సర్వనాశనమే ముక్తి కదా !

జ : నాశనం పురుషార్థం కాదు. జీవుడు నశించడు. విషయోపరాగాలన్నీ నశించటం ముక్తి కాదు.

కనుక "ఏవం శూన్య మపి" అని చెప్పే సర్వశూన్యవాదుల మతంకూడా అంగీకరింపదగినది కాదు.

ప్ర : స్వర్గస్థులవటం ముక్తి కదా !

జ : స్వర్గం ఉన్నట్లయితే అది ప్రదేశమే. అక్కడికి చేరుకోవటం సంయోగం. సంయోగం పొందినవారికి వియోగం తప్పదు. స్థానభ్రష్టత్వం దాన్ని అనుసరించే ఉంటుంది. కనుక స్వర్గస్థులు కావటం కూడా ముక్తి కాదు.

ప్ర : జీవుడు ఈశ్వరాంశతో కూడుకొని ఉన్నవాడే! కనుక ఈశ్వరసన్నిధానం పొందటాన్ని ముక్తి అంటామా ?

జ : అబ్బే. అదీ ముక్తి కాదు.

ప్ర : అణిమాది యోగాలు ప్రాప్తించటం ముక్తి అంటారా ?

జ : అవి అంతకంటే కాదు.

ప్ర : ఇంద్ర, బృహస్పతి, ప్రజాపతి వంటి పదవులు లభించటం ముక్తి అంటారా ?

జ : ఒక్కనాటికి కూడా కాదు,

ప్ర : కళ్ళు, ముక్కు మొదలైన జ్ఞానేంద్రియాలన్నీ పంచభూతాలనుండి ఉత్పన్నమైనవని గౌతముడు, కణాదుడు చెప్పారు. అదైనా నిజమా ?

జ : కాదు. అహంకారంనుంచే ఇంద్రియాలు ఉత్పన్నమయ్యాయి ప్రాణికోటి పరిణామంలో తనకు అవసరమయిన ఇంద్రియాలను తానే ఉత్పన్నం చేసుకొంది. పిపీలికాది బ్రహ్మపర్యంతం ఈపరిణామం కనిపిస్తుంది.

ప్ర : ఆరు పదార్థాలను అర్థంచేసుకుంటే మోక్షం కలుగుతుందట గదా!

జ : పదార్థాలు ఆరే అని గాని, వాటిని అర్థంచేసుకోవటమే మోక్షమని గాని మే మంగీకరించం.

ప్ర : పదార్థాలు పదహారని, వాటిని అర్థం చేసుకుంటే ముక్తి లభిస్తుందని చెప్పేవారితో మీరు ఏకీభవిస్తున్నారా?

జ : అదికూడా మాకు సమ్మతం కాదు.

ప్ర : పోనీ అణువులయినా నిత్యమంటారా?

జ : అణువులుకూడా నిత్యం కాదు: అవికూడా పరమాణు సంయోగంవల్ల ఏర్పడినవే. కనుక కార్యత్వం వాటికీ వుంది. కార్యత్వం ఉన్నందువల్ల వాటిని విభజించేందుకు వీలు లేదనుకోకూడదు.

ప్ర : అణువుకు రూపం లేదు గదా!

జ : అణువుకు రూపం ఉంది. రూపం ఉన్న ప్రతీదీ మనకంటికి కనబడాలన్న నియమం లేదు.

ప్రత్యభిజ్ఞానం :

ప్ర : ప్రత్యభిజ్ఞానం (గుర్తింపు) నిత్యం కదా?

జ : ప్రత్యభిజ్ఞానం కూడా అనిత్యమే కాని చిరకాలం ఉండే జ్ఞాపకాలు నిత్యమన్న భ్రమకలిగిస్తాయి. అది సామాన్యమే. సామాన్య మనగా సమాన బుద్ధిని కలిగించుట. 'అదే ఇది' అని కలిగే నిశ్చయమే సామాన్యం. దీనికి అపలాపం లేదు.

అభావం :

ప్ర : ఘటము పటము కాదంటాము. పటత్వ అభావ రూపమే ఘటమని ఎందు కనుకోకూడదు ?

జ : అనుకో కూడదు. పటత్వ అభావం ఘటం కానక్కర్లేదు. ఘటం ఉన్నది. దాని ఉనికి (భావ) ప్రతీతి మనకు కలుగుతున్నది. కనుక ఆత్మనివృత్తి రూపమయిన అభావంకలగదు.

ప్ర : ఏదోవిషయం మనకు జ్ఞాపకం వచ్చిందికదా! మనజ్ఞాపకం ఆవిషయానికి సాదృశ్యమేలకాదు?

జ : రెండు ప్రత్యక్ష వస్తువులకే సాదృశ్యంగాని, అదేఇది అను జ్ఞాపకానికీ, వస్తువులకీ సాదృశ్యంలేదు.

ప్ర : సాదృశ్యం అన్యవస్తు జ్ఞానాన్ని అపేక్షిస్తుంది, కాబట్టి అది వస్త్వంతరం అంటాను.

జ : వేరొకవస్తువుయొక్క జ్ఞానాన్ని అపేక్షించే మరియొకవస్తువు యొక్క నిజశక్తి అభివ్యక్తినే సాదృశ్యమంటాము.

ప్ర : వస్తువుకీ దానిపేరుకీగల సంబంధం సాదృశ్యం వల్ల తెలుస్తుందా?

జ : తెలియదు. ఏ వస్తువుకు ఏపేరుఉందో పెద్దలు చెపితేనే తెలుస్తుంది.

ప్ర : సంబంధ నిత్యత్వంగల వస్తువులు నిత్యంకావా?

జ : కావు. ఎప్పుడయినా అవి నశిస్తాయి.

ప్ర : పోనీ వాటిసంబంధమయినా నిత్యంకాదా?

జ : సంబంధంగిల వస్తువులే నశిస్తే, ఇక సంబంధంమాత్రం ఎలానిత్యమవుతుంది.

ప్ర : కార్య కారణాలకున్న సమవాయ సంబంధం అయినా నిత్యంకాదా?

జ : అందుకు ప్రమాణంలేదు. కార్యంకాగానే కారణం నశిస్తుంది. కనుక వాటి సంబంధమూ నశిస్తుంది.

ప్ర : ఈ సమవాయ సంబంధాన్ని బలపరిచేందుకు ప్రత్యక్ష, అనుమాన ప్రమాణాలేవీ లేవా?

జ : కార్యకారణాలు తమకుతామే సిద్ధిస్తున్నందున ప్రత్యక్ష ప్రమాణంగానీ, అనుమాన ప్రమాణంగానీ అవసరంలేదు.

## క్రియాజ్ఞానం

ప్ర : క్రియాజ్ఞానం అనుమాన ప్రమాణంవల్లనేకలుగుతుందని బౌద్ధులంటారు.

జ : దగ్గరనుంచిచూస్తే, వస్తువు క్రియా ప్రత్యక్షంగానే అభిస్తాయి గనుక క్రియాజ్ఞానం అనుమాన ప్రమాణం వల్ల కలుగుతుందనే మాట యదార్థంకాదు.

## శరీరం

ప్ర : శరీరం పాంచభౌతికమంటారు నిజమేగా?

జ : ఒకపదార్థం ఏర్పడటానికి చాలా పదార్థాలు ఉపాదానకారణాలు కాలేవు. కనుక శరీరం పాంచభౌతికంకాదు.

ప్ర : స్థూల శరీరం తప్ప యింకేముంది చెప్పండి?

జ : జీవాత్మను ఒక శరీరంలోంచి మరో శరీరంలోకి ప్రవేశింప చేసే సూక్ష్మ శరీరాలు ( వీర్యకణాలు ) చాలా ఉన్నందున స్థూల శరీరం ఒక్కటే ఉందనటం తప్పు

ప్ర : ఇంద్రియాలకు తెలిసిన వస్తువుల జ్ఞానమే కాదు; తెలియనివస్తువుల జ్ఞానాన్ని సైతం అందివ్వగల శక్తి గలదని బౌద్ధులంటున్నారు.

జ : ఇంద్రియాలు తమతో సంసర్గంలేని వస్తువుల జ్ఞానాన్ని ఏమాత్రం పొందలేవు. గుడ్డివాడికి దారి తెలుస్తుందా ? అలా తెలిస్తే సర్వ వస్తు జ్ఞానాన్ని పొందగలరు.

ప్ర : అవయువాలు ప్రకృతికాలు కావు. అహంకారికాలని మీరన్నారు. ఆ మాట చెల్లుతుందా ?

జ : దూరంగా ఉన్న వస్తువును ప్రకాశింపచేయటానికి కంట్లోంచి కనబడని వెలుగొకటి ఆ వస్తువు పై పడి ప్రకాశింపచేస్తోందని న్యాయవాదు లన్నారు.కనుక కంటిని తైజసమన్నారు. అదితప్పు. వృత్తియే దీపకికారణం.

ప్ర : ఆవృత్తి వస్తువుదా ? కంటిదా ?

జ : కన్ను చూడకపోతే వస్తువు కనపడదు. కనుక ఆ వృత్తి కంటిదే. చూచే శక్తిని భిన్నపదార్థంగా గ్రహించండి.

ప్ర : కళ్ళు మొదలైన ఇంద్రియాలను మీరుద్రవ్యాలు అన్నారు. అహంకార జన్యాలెట్లా అయ్యాయి ?

జ : ద్రవ్యాలకు వృత్తిరూప క్రియాసంబంధం ఉంటున్నది కనుక వాటికి అహంకారం ఉన్నదంటాము.

ప్ర : కొన్నిచోట్ల ఇంద్రియాలు అహంకారికాలుగా వుండి, కొన్నిచోట్ల భౌతికాలుగా ఉంటాయా ?

జ : ఏదేశంలోనయినా ఇంద్రియాలు తమ పనుల్ని తామే చేసు కొంటూ ఉంటాయి. వాటిపనుల్ని మరొకటి చేసిపెట్టవు. అందుకే అవి సర్వత్రా అహంకారికములే.

ప్ర : ఇంద్రియాలను కొందరు భౌతికములని ఎందు కన్నారు ?

జ ; కొంతవరకూ ఇంద్రియాలకు భూతాలు నిమిత్తం అయ్యాయి కనుక ; అందుకే వారు భౌతికమన్నారు.

## శరీరభేదాలు

ప్ర: శరీరాలు ఎన్నిరకాలు ?

జ: ఊష్మజం, అండజం, జరాయుజం, ఉద్భిజ్జం, సాంకల్పికం, సాంసిద్ధికం అంటూ శరీరాలను నానారకాలుగా చెపుతారు. శరీరం ఒక్కటే; ఇన్నిరకాలులేవు.

ప్ర: శరీరాలన్నీ పార్థివాలని చెప్పబడుతున్నాయి. మీరు కూడా 'పాంచభౌతికో దేహః' శరీరం పాంచభౌతికమని ముందే చెప్పారు ఎందువల్ల ?

జ: ఇంద్రియాల ప్రవర్తనలో అహంకారం వుంది. అందుకే అహంకారికములని అన్నాము. అవి వస్తుతః భౌతికాలే. వాటన్నిటికీ పృధ్వియే ఉపాదాన కారణం. మిగిలిన భూతాలన్నీ సహకారకాలు. అందుకే శరీరాన్ని పార్థివమంటాము.

ప్ర: శరీరం భౌతికమేగదా! ప్రాణం మాత్రం ఎందుకు భౌతికం కాదు ?

జ: శరీరారంభంలో ప్రాణం లేదు. ఇంద్రియాలు పరిపూర్ణంగా తయారయిన తర్వాతనే స్వశక్తివల్ల ప్రాణాన్ని (ఉచ్ఛ్వాస నిశ్వాసాలను) సాధించుకొన్నాయి. కనుక ప్రాణం భౌతికం కాదు.

ప్ర: జీవునికీ శరీరానికి తొలుత సంబంధం ఎలా ఏర్పడింది ?

జ: రెండు జీవుల సంబంధం నుంచి శరీరం పుట్టింది. ఆ సంబంధమే లేనినాడు శుక్ర శోణితాలు నిరుపయోగాలు.

ప్ర : అందుకే జీవసృష్టిలో ఎంతో కొంత పరమేశ్వర ప్రమేయం ఉంటుందా ?

జ : భృత్యద్వారా స్వామ్యధిష్టితిః నైకాంతాత్—

నౌకరు ద్వారానే యాజమాన్యం చెలాయింపబడుతుంది; సూటిగా కాదు. జీవుడే ఈశ్వరునికి భృత్యుడు. యజమాని తన నౌకరుద్వారా పెత్తనాన్ని చేపట్టినట్లు. ఈశ్వరుడు తన సేవకుడయిన జీవుని ద్వారా తన అధికారాన్ని చెలాయిస్తున్నాడు. అంతేగాని, తానే ప్రత్యక్షంగా చెలాయించటం లేదు.

కనుక జీవునకు బుద్ధి ఏ విధంగా సన్నిహితంగా వుంటుందో అదే విధంగా ఈశ్వరుడు కూడా సన్నిహితంగా ఉంటాడా?— అన్న ప్రశ్న పుడుతున్నది.

జీవుడు జాగ్రిదవస్థలో బుద్ధియందు విహరించినట్లు, యోగం, నిద్ర, మోక్షం అను మూడవస్థల్లోనూ బ్రహ్మత్వం పొందుతాడు.

ప్ర : మోక్షం అంటే ఏమిటో అనుకున్నాను. అది సమాధి, సుషుప్తులతో సమానమేనన్న మాట ! అయితే నిద్రపోవటమే మంచిదికదా !

జ : సమాధిలోగాని, సుషుప్తిలో గాని గాఢంగా నిమగ్నమయిఉండే వాడికి ఎంతో కొంత క్లేశాది వాసన ఉంటాయి. మోక్షంలో అవి ఉండవు. బ్రహ్మత్వం ఈ ముగ్గురికీ లభిస్తుంది. ఎటొచ్చీ మోక్షం కన్నా నిద్రాసమాధులు కొంత తక్కువ స్థాయికి చెందినవి.

ప్ర : లోకానికి తెలిసినంతవరకూ నిద్ర ఉన్నది;

సమాధి ఉన్నది. మోక్షం ఎలా ఉంటుందో తెలియదు.

జ : చూడటానికి సమాధి మాత్రం కనిపిస్తుందా ఏమి ? ఆపాటి మోక్షమూ కనిపిస్తుంది. కనుక సమాధి, సుషుప్తి తప్ప మోక్షం లేదనటం సబబు కాదు.

ప్ర : సమాధిలో క్లేశాదివాసనల్ని అధిగమించవచ్చు. సుషుప్తిలో అది సాధ్యం కాదు గదా !

జ ; కలతనిద్ర వున్నప్పుడే క్లేశాది వాసనలు పీడకలలయి పీడిస్తాయి. గాఢనిద్రయందు ఏ కలలూ ఉండవు. కనుక ఏ వాసనలూ అడ్డం రావు ఏ అనర్థమూ ఉండదు

సంస్కారం :

ప్ర : ఒక రాయిని విసురుతాం. విసరటం ఒక క్రియ. విసరగానే రాయి వేగాన్ని పుంజుకొంటుంది. రానురాను ఆ వేగం తగ్గుతూవస్తుంది. అలా వేగం తగ్గుతూపోవటానికి వేగప్రతిబంధకమయిన క్రియలు జరుగుతూఉంటాయి. ఆవిధంగా రాయి వేగాన్ని పుంజుకోవటం ఒక సంస్కారమయితే, ప్రతిబంధక క్రియలు దానిని నిరోధించటంవల్ల మరికొన్ని సంస్కారాలు ఏర్పడతాయి. వాటి ప్రభావంవల్ల రాయి వేగంసడలి చివరికి నేలమీదపడిపోతుంది. అంతేకదా ?

జ : తప్పు. రాయి నిశ్చలస్థితిలో ఉన్నంత వరకూ సంస్కారం లేదు. అది విసరబడుతున్నప్పుడే సంస్కారం (వేగం) ప్రారంభమయింది.

ఆది ఒకే సంస్కారంతో కడకంటా పోయి నేలమీద పడుతుంది. ఈలోగా ఎన్ని క్రియలు జరిగినా ఆవేగానికి సంబంధించినవే. కనుక సంస్కారం ఒక్కటే అంతేగాని ప్రతిక్రియకూ ఒక్కో సంస్కారాన్ని ఆపాదించటం లక్షణం కాదు. వేగాన్నంతనీ ఒకే క్రియగా తీసుకోవాలి.

శరీరాలు :

ప్ర : భూమిని పెల్లగించుకు వచ్చే మొలకలను శరీరాలని కొందరంటున్నారు. అవికూడా శరీరాలే అయినపక్షంలో వాటికన్నీ సుఖదుఃఖానుభవం ఉండాలి. అలాంటిదేదీ కనబడ లేదు.

జ : వృక్షాలు, లతలు, ఔషధులు, వనస్పతులు, తృణాలు-మొదలయినవన్నీ శరీరాలే. శృతి. స్మృతులు కూడా అలాగే చెప్పాయి

ప్ర : అయితే వాటికి కర్మాధికారం ఉందా ?

జ : దేహులయినంతమాత్రాన వాటికి కర్మాధికారం లేదు. విశిష్టులకు మాత్రమే వుంది.

కర్మదేహం, ఉపభోగదేహం, ఉభయదేహం అని శరీరాలు మూడు రకాలుగా ఉన్నాయి. వృక్షాదులు ఉపభోగదేహులు. కర్మదేహులకు, ఉభయదేహులకు మాత్రమే కర్మాధికారం ఉంది.

గృహస్థులు ఉపభోగదేహులు. కర్మదేహులు పిల్లలు కేవల ఉపభోగదేహులు: వానప్రస్థులు కర్మదేహులు: సంన్యాసులు కించిత్ కర్మానశేషం కూడా లేనివారు.

అగ్నికి ఎంత గొప్ప ఆశ్రయం దొరికినా దానిని దహించక మానదు. చివరకు చల్లారిపోకనూ మానదు. అలాగే బుద్ధి నిత్యత్వం కూడా స్థిరం కాదు. కనుక బుద్ధికి ముఖ్యగుణాలయిన సంకల్పం గాని, జ్ఞానం గాని ఏమాత్రం నిత్యం కావు. అవికూడా నశించేవే.

## సిద్ధులు :

లోకంలో మణులున్నాయి; ఔషధాలున్నాయి. ఆ మణులవల్ల మనిషికి మంచి చెడ్డలు కలుగుతున్నాయి. ఆ ఔషధాలవల్ల మనిషికి నానా రోగనిర్మూలనం జరుగుతోంది. ఇదంతా నిజమైనట్లే, యోగాభ్యాసంవల్ల సిద్ధులు లభించటం జరుగుతున్నది. వాటిని కాదనకూడదు.

ఏ ఒకడిలో లేని చైతన్యం పదిమంది కలిస్తే వస్తుందనుకోవడం తప్పు. ఏ ఒక్క భూతంలోనూ కనబడని చైతన్యం అయిదు భూతాల కలయికవల్లనే ఏర్పడిం దనుకోవటం తప్పు.

# 6

# ఉనికి

**ఆత్మ లేదని చెప్పటానికి హేతువు లేనందువ ఆత్మ ఉన్నది.**

ప్ర: లేదని ఎవరన్నారు? అది శరీరమే గదా!

జ: దేహం వేరు; ఆత్మ వేరు. అది దేహంకన్నా, ఇంద్రియాల కన్నా, బుద్ధికన్నా వేరు. కనుకనే అది 'నా' శరీరం, నాబుద్ధి అని వ్యవహరిస్తుంది. నేను అని అహంతో ఏదయితే చెపుతుందో అదే ఆత్మ.

ప్ర: దుఃఖాదులు ఆత్మకే కదా!

జ: కాదనను. కాని అత్యంత దుఃఖనివృత్తి కలిగినప్పుడు ఆత్మ కృతకృత్యమవుతుంది. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికాలను మూడు రకాల దుఃఖాలు నివృత్తిని పొందాలి.

ప్ర: సుఖప్రాప్తి కలగాలనక, అత్యంత దుఃఖనివృత్తి మాత్రమే అంటారెందుకు?

జ: దుఃఖంవల్ల ద్వేషం కలుగుతుంది. అందుకే దుఃఖం పోవాలని అంటాము. కాని సుఖం కావాలని అనము సుఖంవల్ల కోరికలు కలుగుతాయి. తీరని కోరికలవల్ల మళ్ళా దుఃఖం కలుగుతుంది. కనుక సుఖాభిలాష మంచిదికాదు.దుఃఖనివృత్తియే పరమార్థం.

ఎక్కడో ఎవడో సుఖంగా ఉంటే ఉండుగాక: జన సామాన్యసు మెవరూ ఖంగాలేరు. అందుకే దుఃఖం పోవాలని అంటున్నాము.

ప్ర : ఇంతకీ సుఖం దుర్లభ మంటారా ?

జ : అంతేకాదు. ఎంతటి సుఖమయినా ఎంతోకొంత దుఃఖంతో కూడుకొనే ఉంటుంది. కనుక వివేకులు దుఃఖం పోతే చాలంటున్నారు.

ప్ర : సుఖంలేకుండా దుఃఖనివృత్తి అయితేమాత్రం పరమ పురుషార్థం అవుతుందా ?

జ : సుఖం ప్రాప్తించ లేదుగదా అని దుఃఖనివృత్తిని పరమ పురుషార్థం కాదనకండి. దుఃఖనివృత్తివల్ల సుఖం కలగక పోయినా ఆనందం కలుగుతుంది. కనుక తప్పులేదు.

ప్ర : సుఖదుఃఖాలు బుద్ధికి సంబంధించినవని కదా సాంఖ్యం చెపుతున్నది. వాటికీ ఆత్మకీ సంబంధం ఏమిటి ?

జ : అవివేకంవల్ల ఆత్మ, బుద్ధిగత దుఃఖాన్ని తన దుఃఖంగా భావిస్తున్నది. పక్కింటివాడు చచ్చిపోతే ఈ యింటివాడు కంటతడి పెట్టినట్లు.

ప్ర : ఆ అవివేకం ఎక్కడ ఎలా కలుగుతోంది ?

జ : అవివేకం అనాది. అనగా కారణం లేకుండానే కలుగుతుంది కారణం ఉందనుకుంటే దోషమవుంది. అవివేకం తప్ప వివేకమే లేదనుకొంటే అదీ దోషమే.

ప్ర : అవివేకంఅనాదియే అయితే నిత్యం కావాలి గదా ?

జ ; అవివేకం పదార్థం కాదు. వివేకం లేనిస్థితి. బుద్ధికి వివేకం కలగగానే అవివేకం నిత్యంకాదు. దీపం వెలిగిస్తే చీకటి పోతుందిగదా !

ప్ర: దీపం ఉన్నంత వరకే చీకటి తొలగుతుంది, దీపంవల్ల చీకటి నిర్మూలింప బడదు. అవివేకం కూడా వివేకం ఉన్నంత వరకే తొలగుతుంది గాని, పూర్తిగా నిర్మూలింప బడదంటాను. అవునా ?

జ : ప్రకాశం ఉన్నంత వరకూ చీకటి ఉండదు. ప్రకాశం పోగానే చీకటి పడుతుంది. ఇది ప్రతినియమం.

ప్ర; అవివేకం తొలగినంత మాత్రాన బంధ నివృత్తి ఎట్లా అవుతుంది ?

జ : స్వభావతః ఎవరూ బంధాలను కాంక్షించరు. అవివేకం వల్లనే బంధాలలో పడతారు. అవివేకం తొలగటంతో బంధవిమోచనం కూడా జరుగుతుంది. బంధ విముక్తియే ముక్తి.

ప్ర : బంధ విముక్తి అంటున్నారు. అది కార్యమే కదా ! కార్యాలు నశిస్తాయి. కాబట్టి ఎంతటి ముక్తునకయినా మళ్ళీ బంధాలు తప్పవు.

జ : వివేకం నశించదు. వివేకం నశించనంతవరకూ అవివేకం గాని, దానివల్ల కలిగే బంధంగాని కలగవు— అని శ్రుతి చెప్తున్నది.

మళ్ళీ మళ్ళీ బంధాలు తగులుకొనే పక్షంలో అది మోక్షంకాదు. పరమపురుషార్థం కాదు. అలాంటి దానిని ఏ పురుషుడూ అంగీకరించడు.

మీరన్నదే నిజమయితే ముక్తులకూ, బద్ధులకూ తేడా వుండదు.

ప్ర : ముక్తి అంటే ఏమిటండీ ?

జ : అవివేక నాశనమే ముక్తి.

ప్ర : ఇంతకు ముందే గదండీ దుఃఖనివృత్తియే మోక్ష మన్నారు ?

జ : అవివేకమే దుఃఖానికి నిమిత్తం. అవివేకాన్ని నశింపజేస్తే దుఃఖం దానికదే పోతుంది గదా ! కాబట్టి నేను చెప్పినదాంట్లో విరోధం (Contradiction) లేదు.

ప్ర : లోకానుభవ సంగ్రహమే వివేకం. అది వింటే వస్తుంది.

జ : అందరికీ వివేకం అంత తేలికగారాదు. కొందరికి వింటే వస్తుంది. కొందరికి కంటేనే వస్తుంది. కొందరికి అనుభవిస్తేనేగాని రాదు. కొందరికి అనుభవించినా రాదు.

విన్నంత మాత్రాన ఏదీ మనస్సులో నిలవదు. నిత్యమూ మననం చెయ్యాలి మననం చేసిన కొద్దీ వివేకం పెరుగుతుంది.

ప్ర : ఎలాంటి ఆసనం వేసుకోవాలి ?

జ : స్థిరంగా, సుఖంగా కూర్చోవటానికి పనికివచ్చే ఆసనమయితే చాలు.

ప్ర : ధ్యానం చెయ్యాలి కదా ! దేనిని ?

జ : ధ్యానం నిర్విషయం మనః- ఏవిషయం గురించీ ఆలోచించకుండా ఉండటమే ధ్యానం (meditation) అనబడుతోంది.

ప్ర : అలాంటిది చేసినా ఒకటే, చేయక పోయినా ఒకటే.

జ : ఆ రెండింటివల్లా ఒరిగే దేమీలేదని అనుకోవద్దు. దానివల్ల మనసులోని ఉపరాగాలు (impressions) నిరోధింపబడతాయి. అదే విశేషం. ఆత్మకు ఎంతటి నిస్సంగత్వమున్నా అవివేకంవల్ల ఈ ఉపరాగాలు కలుగుతూ ఉంటాయి.

ప్ర : ఎలా కలుగుతాయి?

జ : స్ఫటికానికి సమీపంలో ఉండే పువ్వులు స్ఫటికంలో ప్రతిబింబించి, దానికి లేని రంగును ఆపాదిస్తాయి. ఆత్మకు ఈ వాసనలు స్వతహాగా లేవు కాని అవి బుద్ధిలో తాదాత్మ్యం చెందటంవల్ల అవి తనవే నన్నభ్రమ పురుషునికి కలుగుతుంది. అదే "అభిమానం".

ఈ అభిమానం ధ్యానం, ధారణ, అభ్యాసం, వైరాగ్యం వంటి వాటిచే తొలగిపోతుంది.

ప్ర : ధ్యానాదులవల్ల ఉపరాగ నిరోధం కలిగే విధానం చెప్పండి!

జ : లయం అనగా నిద్రావృత్తి. ప్రమాణం, విపర్యయం, వికల్పం, స్మృతి అను వృత్తులే విక్షేపం. ఇవన్నీ ధ్యానాదులవల్ల తొలగిపోతాయి. తద్వారా ఉపరాగ నిరోధం కలుగుతుంది.

ప్ర : ధ్యానానికి ఎలాంటి స్థలం మంచిది?

జ : చిత్త ప్రశాంతతకు భంగం కాని ఏస్థలమయినా ఫరవాలేదు.

ప్ర : ఈ అభిమానానికి కారణ మేమిటి ?

జ : ప్రథమకారణం ప్రకృతి. ప్రకృతి కార్యమే బుద్ధి.

ప్ర : పురుషుడే ఎందుకు కాకూడదు ?

జ : పురుషునికి నిత్యంత్వం ఉన్నది. పరిణామం లేదు. ప్రకృతికే పరిణామం ఉన్నది. ఏది పరిణామశీలియై ఉన్న దో అది ఉపరాగవంత మవుతుంది.

ప్ర : పోనీ మూర్ఖుడయిన పురుషుడే అభిమానానికి కారణ మనుకోవచ్చా ?

జ : శ్రుతి విరోధమయిన కుతర్కాన్ని చేసే అధముడికి ఆత్మ ప్రాప్తి లేదు.

ప్ర : చెట్లు స్థావరాలు. వాటికి భూమియే కారణం, ఇక ప్రకృతి ఉపాదాన కారణం ఎలా అవుతుంది ?

జ : చెట్లువంటి స్థావరాలకు భూమి, నీరు మొదలయినవన్నీ ఉపాదాన కారణాల నుమాట నిజమే. కాని ఈ చెట్లూ మున్నగువాటికి పారంపర్య గుణమున్నదే ;—అది ప్రకృతివల్లనే కలిగింది. అది ఆ చెట్టులో అణువులా అంతర్గత మైఉన్నది. అదే లేకపోతే చెట్లు పువ్వులు పుయ్యవు, కాయలూ కాయవు. ఆవేరకం చెట్లసంతతి వ్యాపించనూ వ్యాపించదు. అణువూ, అణువూ కలిసినప్పుడు ఏర్పడే అణుపుంజం పదార్థమయినట్లు. ఈ పారంపర్య వ్యాప్తియే వృక్షవంశాన్ని ఉద్ధరిస్తున్నది.

ప్ర : అంతమాత్రాన ప్రకృతికి విభుత్వం (Government) ఉన్నదా ?

జ : ఎందుకు లేదు ? మేఘావృతమయిన ఆకాశం గర్జించటం లేదా ? పెను తుపానులు తక్కువభీక్షత్వాన్ని సృష్టిస్తున్నాయా ? పిడుగులు, ఉల్కాపాతం. సముద్రాలు పొంగటం ఇదంతా ఏమిటి ?

ప్రకృతి యొక్క విభుత్వమేగదా: అది సాపేక్షం. కావాలని జరిగే పని. పరమాత్మ విభుత్వం అలాకాదు: అది నిరపేక్షం.

ప్ర : ప్రకృతి విభువయినట్లయితే జగత్తు సృష్టింపబడే అవకాశం లేదు. ఉండదనుకున్నా నూలుపోగులు బట్టకు ఉపాదానకారణమయినట్లు జగత్తునకు ప్రకృతి ఉపాదాన కారణం కాలేదు

జ : పరమాణువుల సంఘాతం (Association) వల్లనే పదార్థమేర్పడుతున్నట్లు ప్రకృతి గతియోగమే జగత్తునకు ఉపాదాన కారణమవుతున్నది.

ప్ర : ప్రకృతికి క్రియ ఉన్నది. కనుక అది ద్రవ్యం. పృథివ్యాది ద్రవ్యాలలో దాని స్థానం ఏమిటి ?

జ : పృథివ్యాదులకన్నా ప్రకృతి అధికమైనది. సర్వద్రవ్యాలకు ప్రకృతే మూలకారణం. కనుక ద్రవ్యమయినంత మాత్రాన మరొక ద్రవ్యంలో అంతర్భాగం కావలసిన పనిలేదు. అది మూలద్రవ్యం గనుక.

గుణాలు :

ప్ర : గుణాలు క్రియావంతాలే గదా !

జ : గుణానికి తాడని అర్థం. అది బంధించటానికే పనికొస్తుంది.

సత్త్వ, రజస్, తమోగుణాలు కూడా బంధనసాధనాలేగాని అన్యంకావు. అవి క్రియావంతాలు కావు.

ప్ర : ప్రకృతి జడం కదా! దానికి ఉపభోగించే యోగ్యత లేదు. అలాంటప్పుడు ఈ సృష్టి ఎందుకు?

జ : తన కేమాత్రం ఉపయోగం లేకపోయినా ఒంటె వ్యాపారి కోసమే కుంకం బస్తాలను మోసుకొస్తుంది. అదే విధంగా ప్రకృతి కూడా తనకే ఉపభోగమూ కలగనప్పటికీ పురుషుని ఉపభోగార్థమే ఈ సృష్టిని సాగిస్తున్నది.

ప్ర : ప్రకృతి ఏకాకి గదా! దానియందు యింత సృష్టి వైచిత్రి ఎలా కలిగింది?

జ : కర్మవైచిత్రి వల్లనే సృష్టివైచిత్రి ఏర్పడింది.

ప్ర : సృష్టి సరేసరి. ప్రలయంఎలా ఏర్పడుతోంది?

జ : ప్రకృతి యొక్క సామ్యభావమే సృష్టి. అదొక విరూప పరిణామం. జీవం నుంచి జీవకణాలు వెలువడి వేర్వేరు జీవులు కావటం వంటిది సృష్టి. సరూప పరిణామం ప్రలయం. పుట్టిననాటి నుంచి, గిట్టేనాటి దాకా శరీరం పొందే పరిణామమే ప్రలయం ఇది ప్రకృతి యొక్క వైషమ్య భావంవల్ల కలుగుతోంది. కనుక ప్రకృతి యొక్క సామ్యం, వైషమ్యాలవల్లనే ఈ రెండు పనులూ జరుగుతున్నవి.

ప్ర : ప్రకృతి యొక్క సృష్టి ఎన్నడు వ్యర్థమవుతుంది?

జ : వివేకవంతుడయిన పురుషుని ముందు ప్రకృతి యొక్క సృష్టి వ్యర్థమవుతుంది.

ప్ర : ప్రకృతి అన్నం లాంటిది. అది ముక్తులకూ, బద్ధులకూ కూడా భోజనీయమే

జ : వివేకం లేనివారికి ప్రకృతి ఉపభోగమే అవుతోంది. ముక్తులకు అవివేకం ఉండదు కావున వారికి ప్రాకృతిక భోగాలందు ఆసక్తి లేదు.

ప్ర : ముక్తులువేరూ, బద్ధులువేరూ అని పురుష బహుత్వం ఉందా ?

జ : లేకేమి? లోకంలో ప్రతిక్షణమూ కొందరు పుడుతూ ఉన్నారు. కొందరు మరణిస్తున్నారు. కొందరు ముక్తులవు తున్నారు. కొందరు బద్ధులవుతున్నారు ఈ విధంగా జీవులు వివిధంగా ఉన్నందున జీవులనేకులని చెప్పవలసి వస్తున్నది.

ఉపాధి

ప్ర : జీవులెప్పుడయితే అసంఖ్యాకు లయ్యాయో పరస్పరాను రాగంవల్ల వారిలో ఉపాధి (కుటుంబనిర్మాణాసక్తి) ఏర్పడి సంతానం కనటంకోసం రెండు ఒకటవుతున్నాయి. అది అద్వైతస్థితే కదా !

జ : తాత్కాలికంగా అద్వైతస్థితిని పొందినా తిరిగి రెండవుతున్నాయి గదా !

ఆత్మ స్వయంప్రకాశంగలది. కనుక అదే కర్త అదే కర్మ అవుతున్నది. అది రమిస్తున్నది. రమింపబడుతున్నది. దానికి జడధర్మం లేనందున శరీరాది జడపదార్థాలను చైతన్యంతో ప్రకాశింపజేస్తున్నది.

## వైరాగ్యం

విషయాసక్తులయిన వారికి వైరాగ్యం కలగటం తప్పకాదు. బాహ్యజగత్తునందు వైముఖ్యం కలిగితేగాని ఆత్మసాక్షాత్కారం పొందలేరు.

## జగత్తు

ప్ర : ఈ జగత్తు సత్యమేనా ?

జ : స్వప్నంలో కనిపించే ప్రపంచం మెలకువ రాగానే పోతుంది. ఈ బాహ్యజగత్తు అలాపోదు. ఈ జగత్తు పుట్టుకకు నిద్రాది దుష్టకారణా లేవీ లేవు కనుక మెలకువ రాగానే పోతుందను కోవటానికి వీల్లేదు. కనుక జగత్తుసత్యమే గాని, మిథ్యకాదు.

ఈ జగత్తంతయు సద్రూపంలోనే ఉంది. సత్ అనగా వస్తువు. ప్రకారాంతరం (అనగా విశిష్టజ్ఞానం వల్ల కలిగిన విశేషణం) లేకుండా పదార్థం పుట్టింది.

## అహంకారం

అహంకారానికి కర్త పురుషుడుకాదు.అహంకారం ప్రకారాంతరమే.

ఈ అహంకారానికే కర్మాధికారం ఉంది. అదిచేసే కర్మఫలాను భవమే సుఖదుఃఖాది రూపంలో జీవునికి అనుభవం అవుతున్నది.

మనంచేసే కర్మల (పనుల) లోగల సామర్థ్యాన్ని బట్టి చంద్ర మండలానికి పోయి, తిరిగిరావచ్చు.

ప్ర : చంద్రమండలానికి పోయినవాళ్ళు హాయిగా

అక్కడుండక తిరిగి రావటమెందుకు? అది అవివేకం కాదా?

జ: భూలోకంలో తనకు తెలియక పోయినా ఎవడయినా చెపితే వివేకం కలుగుతుంది. చంద్రమండలంలో అలా చెప్పేవాడూ లేడు; ఉన్నా చెపితే వివేకమూ కలుగదు కనుక వచ్చేస్తారు.

ఇలా అస్తమానూ చంద్రమండలానికి రాకపోకల్ని మానవుడు కల్పించుకో గలిగితే అది విముక్తియే అని వేదం చెప్పింది.

గతి

పురుషుడే విభువని కొందరివాదం. వారి వాదం ప్రకారం ఉపాధి సంబంధం వల్ల సమస్త సంసారమూ ఏర్పడుతున్నది. సంతానం కలుగు చున్నది. దేశమూ, లాభమూ ప్రాప్తిస్తున్నాయి.

సాంఖ్యులమయిన మేము బుద్ధిసత్త్వమునందు విశ్వాసంతో 'గతి' ప్రమాణంగా జీవులు దేశాంతరప్రాప్తి పొందగలవని విశ్వసిస్తున్నాము. శరీరం ఉండగా జరిగేపనేకాని, శరీరం లేకుండా జరిగేపని మాత్రంకాదు.

గతి వల్లనే వ్యాపకత్వం (Expansion) కలిగి భోగము, దేశము, కాలము లభిస్తాయి.

ప్ర: ఈ లోకం లోకాంతరాలన్నీ జీవుని భోగం కోసమే సృష్టింప బడ్డాయని మీరు భావించే పక్షంలో, మరణా నంతరం వెంటనే ప్రవేశించటానికి వేరొక శరీరం తయారయి ఎందుకు సిద్ధంగా లేదు?

జ : జీవుడు ప్రవేశించకుండా ఉండే ఏ శరీరమయినా శవమే. ఏ శవమయినా అల్పకాలంలో చెడిపోక తప్పదు. అందుకే జీవునికోసం ఏ శరీరమూ ముందుగా తయారయి సిద్ధంగా ఉండదు.

ప్ర: స్త్రీ శరీరంలో శుక్రశోణితాల మిశ్రమంగా వర్పడే శరీరమే గదా ! అది చెడిపోవలసిన అవసరమేముంది ?

జ ; బీజం అంకురించాలంటే అందుకు సంబంధించి నీరు ఉండాలి. నీటికే 'జీవం' అనిపేరు. తనకు సంబంధించిన జీవం తనలో లేకుండా ఏ బీజమూ మొలకెత్తదు. అలాగే శరీరం శుక్రశోణితాల మిశ్రమమే అయినప్పటికీ జీవం లేకుండా అభివృద్ధి పొందదు. శుక్రశోణితాల మిశ్రమంలోనే జీవం ఉన్నది. నిర్జీవమయిన శుక్రశోణితాలు ఏకమయినా శరీరం తయారు కాదు.

శుక్రశోణితాలలో జీవం ఉన్నదని ఎప్పుడయితే గ్రహించామో అవి నిర్గుణాలు కావని గ్రహించినట్లే. జీవమెప్పుడయితే ఉన్నదో దానికి అప్పుడే అహంకారం బయలుదేరుతుంది. అహంకారం వల్లనే దాని శరీరం పెరుగుతుంది. శుక్రశోణితాల మిశ్రమంనుంచి అహంకారం పుట్టిందనే చెప్పాలి. శరీరధారణ, పోషణ, బీజవ్యాప్తి దాని వృత్తులు.

ప్ర: దీనినిబట్టి జీవుని కర్మలన్నీ ఆత్మతంత్రాలో, పరతంత్రాలో తెలియటంలేదు.

జ : ఎవడేపనిచేసినా, అహంకారంతోనే చేస్తాడు. అహంకారం

లేకపోతే వాడేలేడు. ఈ అహంకారానికే పురుషకారమని మరో పేరు. సమస్త కర్మలూ ఆత్మతంత్రాలే గాని, పరతంత్రాలు కావు.

ప్ర : అలా అయితే కార్యసిద్ధి జీవుల అదృష్టంపయినే ఆధారపడి ఉంటుందనుకోవాలి.

జ : దేనినయితే అదృష్టమంటున్నామో అది పురుషయత్నంవల్లనే లభిస్తున్నది. పురుషయత్నానికి మించిన అదృష్టం ఎక్కడా లేదు. సామాన్యులకు కార్యసిద్ధి కనిపించినట్లుగా కార్యం కనపడదు గనుక 'అదృష్ట' మనుకుంటారు. కార్యం అదృష్టమే.

ప్ర : వివేకం మనస్సునకు సంబంధించిందే కదా ! ఈ రకం మనోకర్మకూడా పురుషయత్నంవల్లనే లభిస్తుందా ?

జ : మహత్తు (బుద్ధి) అట్లా కాదు. అది కేవలపరమేశ్వరప్రసాదమే. యమనియమాదులవల్ల మనోనిగ్రహం లభిస్తుందేగాని బుద్ధి పెంపొందదు.

## ప్రకృతి-పురుషసంబంధం :

ప : ప్రకృతి పురుషు (పరమేశ్వరుడు)ల సంబంధం ఎలాంటిది ?

జ : ప్రకృతిపురుషులకు గల సంబంధం స్వస్వామి సంబంధం. పరమేశ్వరుడే స్వామి. అతని స్వమ్, అనగా సొత్తు ఈ ప్రకృతి. ఇది కర్మనిమిత్తకంగానే కలిగింది. బుద్ధి కర్మేంద్రియాలద్వారా తన సంక

ల్పాన్ని నెరవేర్చుకున్నట్లు, పురుషుడు (పరమేశ్వరుడు) ప్రకృతి ద్వారా తన కర్మల్ని నెరవేర్చుకొంటున్నాడు ఈ కర్మసంబంధం లాగే అవిభాజ్యమయినది.

ఈ స్వస్వామి భావ సంబంధానికి అవివేకమే కారణమని పంచశిఖాచార్యు లన్నారు.

లింగశరీరా (బుద్ధి) నికీ, శరీరానికీ ఉండే సంబంధంవంటిదని సనందనాచార్యు లన్నారు.

ఈ సంబంధం కర్మనిమిత్తకం కావచ్చు: అవివేక నిమిత్తకం కావచ్చు: సూక్ష్మశరీరనిమిత్తకం కావచ్చు ఏదయినా దాని విచ్ఛిత్తివల్లనే మోక్ష మను పురుషార్థం లభిస్తుంది, లభిస్తుంది.



